# అంకితము.

---

చం॥ చినతన మాదిగానను విశేష కృపారస దృష్టిజూచి భో

జనతనుపోషణాదులను సాదరమొప్పగ జూచుచుండు నా

జననికి నర్సమాంబకు విశాలయశోలలనాఢ్య కింపుమై

ఘనముగ నంకితంబిదియ గౌరవమందునుగాక భూస్థలిన్.

ఇట్లు

హనుమంత పేర్ఝుల జగన్నాథశర్మ

లక్ష్మీపోలవరం



శ్రీరస్తు

# కృష్ణలీల.

——— :)o(: ———

నాంది-ప్రస్తావన

సురసంసేవ్యము, గోపికాజనమనో శోభాయమానంబు సా
దరగోపాలక ప్రార్థితార్థమును బృందారణ్య సంచారమున్
ధరపై మోహనమంత్రరాజము, యశోదానందసంధాయమౌ
మురళీగానరవంబు సభ్యులకు సమ్మోదంబిడు న్నిచ్చలున్.

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి)

ఆహా! నేడీ సభాభవన మతిలోకరమణీయమైయున్నదిగదా(అటు నిటుజూచి) నటీ యొకసారియిటువచ్చెదవా.

(నటిప్రవేశించుచున్నది)

నటి—ప్రవేశించి నాథాయేమాజ్ఞాపించుచున్నారు.

సూ—కాంతా చూచితివా

గీ॥ భువనవిఖ్యాత పండితుల్ భూరియశులు
నిత్యసంతోష గానసాహిత్య ఘనులు,
నవరసాశ్రితసత్కావ్య కవనవిదులు
లీల నాసీనులయిరి సోఫాలపైన.

వీరు

గీ॥ నవరసాశ్రితమైయొప్పు నాటకంబు
నాడవలయునటంచు నాకానతిచ్చి

యున్నవారలు యేకృతి యొప్పులాడి
యాడ, వీరిమనంబు లాహ్లాదమందు,

నటి—అంతయాలోచన మేల కృష్ణలీలలేదా

సూ—బాగుగాజ్ఞాపకముచేసితివి. అవును ఆకృష్ణలీల నవరసాశ్రితమై యొప్పుచున్నది.

నటి—నాథా దానిపేరు వినుటయేగాని కృతికర్త యెవ్వరో యెరుంగ వినియుండుట మంచిదిగదా చెప్పుడు

కాంతా! చెప్పెద నాలకింపుము.

సీ॥ లలిమహాశ్వేతావి ♦ లాసంబు రచియించి
గణనకెక్కినయట్టి ♦ ఘనుడెవండు
సద్బోధకంబుగా ♦ జారవిలాపంబు
రచియించి సత్కీర్తి ♦ గాంచెనెవడు
నయఫక్కిని జయంత ♦ జయపాలనాటకం
బతిమృదుశయ్యగా ♦ నతికె నెవడు
శ్రీయాజ్ఞవల్క్యంబు ♦ షీశుచారిత్రంబు
నేకమాలికగా ర ♦ చించె నెవడు
అతడు హనుమంతనర్యులా ♦ స్వాయవిధుండు
శాస్త్రకోవిదుబుచ్చన ♦ శాస్త్రి కెలమి
నరసమాంబకు తనయుండు ♦ నయవిదుండు
శ్రీజగన్నాధనాముండు ♦ చేసె నతివ.

నటి—ఓహో యీయన నిదివర కెరుంగుదుము గదా.

సూ—ఎరుంగ కేమి ఆజారవిలాపము మరువ దగినదా

నటి—నాథా యీకృష్ణలీల నాటకంబులో భాగవతములోని పద్యములున్నవని మాయన్న చెప్పినాడే.

సూ॥ అవును ఉన్నమాటసత్యమే అందుచేతనే యీకవిగూడ

గీ॥ పోతరాజకృతంబయి భూతలమున
దనరుచుండిన భాగవతంబునుండి

సరస మగుపద్యముల నెల్ల సంగ్రహించి
వ్రాసితిని సద్యశం బెల్ల వానిదె సుడి.

అని వ్రాసికొనియేయున్నాడు.

నటి—నాథా భాగవతము చాల పెద్దగ్రంథము గదా యీ కవి యెంతవరకు కథావిధానము వ్రాసినాడు.

సూ—ప్రేయసీ వినుము

ఉ. బన్నుగ పోతరాజకృత • భాగవతంబున నున్నపద్దెముల్
గొన్నిటి నచ్చటచ్చటను • గూర్చిమహాత్ములకెల్ల నాదియౌ
వెన్నునిసత్య మాచరిత • వేడ్క మనోహర భక్తి గూర్చి తా
గ్రన్నన వ్రాసె నో రమణి • కంసపరాభవ మంతమందు గన్.

నటి—సంతోషము ఇంకేమి చేయునలయును.

(తెరలో)

అరే యెవడవురా! దంభప్రలాప! సకలసురాసురమణిగణశోభిత పాదుండగు కంసునకే పరాభవంబు బల్కుచుంటివి గా ఏమీ నీ కండ కావరము అరే పాపశైలూషాధమా నిలు! నిలుము ఎందుబోయెదవు నీప్రాణములయందాస వీడుము.

నటి—(భర్తను కౌగిలించుకొని భయముతో) అమంగళము ప్రతిహతమగుగాక నాథా! యేమిది! భయమగుచున్నది పోదము రమ్ము.

సూ—బోటీ భీరురాలవు గాకుము. కంసపాత్రమును ధరించిన మనసుమిత్రుం తనపాత్రపోషణము చేసికొనుచు నేను బావమరదినగుటచే నిట్లనుచువచ్చుచున్నాడు ఇంక మనమిటనుండ నవసరము లేదు.

నటి—అమ్మా! మాయన్న యెంతటివాడు! తక్కినపాత్రలను సిద్ధము చేయవలయును గదా పోదము రండు.

(ఇరువురు నిష్క్రమింతురు.)



శ్రీరస్తు

శుభమస్తు

శ్రీయాజ్ఞవల్క్య పరబ్రహ్మణేనమః

# కృష్ణలీల.



## ప్రథమాంకము.

(కంసుడు కోపావేశముతో ప్రవేశించుచున్నాడు)

కం—(సాటోపముగా నిటునటునడచి క్రోధముతో)అరే అరే యెవ డవురా దంభప్రలాప సకలసురాసురమస్తకమణి శోభితపాదుం డగు కంసునకే పరాభవంబు బలుకుచుంటివిగా, ఏమీ నీకంద కావరము! త్రిభువన జయలక్ష్మీ విరాజమానుండు కంసుండని యెరుంగవు గాబోలు.

గీ॥ మత్ప్రతాపాగ్ని నెరిగియే మాధవుండు
సంద్రమున దాగి యుండెను, శంకరుండు
గుట్ట నెక్కెను పాదము, ల్పట్టుచుండి
రమరు లెల్లరు, నెవ డోపు, నహహా! నన్ను.

నాతోభండనమున నిలిచి నాప్రతాపమునోర్చు మానవమాత్రుండు గలడె. కంటికిగాన రాకుండ పోయితివిగాని లేకున్న నీపాటికి యమాలయమున నుండకుందువే. (ముందుజూచి) అరుగో నాసోదరియు నామె భర్తవసుదేవుడును ప్రయాణసన్నాహముతో వచ్చియున్నారు. నేనీ క్రోధావేశముచే నెరుగనైతిని. ఈవాచాలురమాటలు లక్ష్యపెట్టు

ద్వితీయాంకము.

చాడనా నేను. (అపశకునమునూచించుచు) ఏమి యీదినమున నన్నియు నపశకునములే యగుచున్నవి. (సాక్షేపముగా) 'ఈశకునబలము బల హీనులనుగాని మాభోటివారినేమిచేయగలదు. (దేవకీ వసుదేవుల వంక చూచి)

సోదరీ యిక్కడికే కాలమతిక్రమించె రండు వేగ రథారోహణము సేయుడు. మిమ్ముల నిల్లుచేర్చివచ్చెద.

(దేవకీవసుదేవులు రథమునెక్కబోవుచుండ నాకసమున)

ఓరోరీ కంసదానవా!

కం॥ తుష్ట యగుభగిని మెచ్చగ
నిష్టుడవై రథము గడపె, దెరుగవుమీఁదన్
శిష్ట యగుసీతలోదరి
యష్టమగర్భంబు నిన్ను, హరియించు జుమీ

కం—(విని) హాహాతోస్మి (అని కూలును).

దే—(భయముతో) నాథా! యీయుపద్రవ మేమి.

వ—నాకిది యంతయు నైంద్రజాలమువలె నున్నది.

కం—(లేచి)ఏమిది! యీపలుకులయర్థము నాసోదరియొక్క యష్టమగర్భమున జనించిన పురుషుడు ననుజంపుననిగదాకానిమ్ము. నాసోదరి బ్రతికి యుండినగదా గర్భము ధరించుట యీయశరీరవాణివాక్యము లేమగునో యెరింగెద గాక (అనికత్తిదూసి రథమెక్కబోవు దేవకిని కొప్పుబట్టుకొని క్రిందకీడ్చి నరకబోవును).

(వసుదేవుడడ్డముగా జని)

బావా! కంసమహారాజా ఏమిది యీఘోరము. ఇంచుక తాళుము. ఇప్పుడే మమ్మిల్లుజేర్తునంటివి. ఇంతలోనే యింత యన్యాయమా.

కం॥ (వసుదేవునిగెంటివైచి) ఏమీ! నీవు వినలేదా యీమెకు జనించిన వాఁడు నన్ను జంపునని యిప్పుడేగదా యశరీరవాణి పల్కినది, ఈమె బ్రతికియున్నచో నాకు మరణము గలుగదా నాప్రాణము నిమిత్తమై యీమె నీక్షణముననే చంపివైచెదను.

వ—బావా! చిన్ననాటినుండి యల్లారుముద్దుగా పెంచినచెలియలిని నీ మాతృపువాక్యములకే చేతులారచంపుటదగునా ఎంతయో ప్రేమిడితో పెంచితినని చెప్పితివే. ఎన్నెన్నియో కానుకలనిచ్చితి వే. ఎంతయో సంతోషముతో వివాహము చేసితివే. ఇంతలో నింతక్రోధము పొందనగునా. బావా యించుక ఆలోచించి చూడుము. నిన్నగాక మొన్న వివాహము చేసి యత్తవారింటికి బంపుటకు మారు యమాలయమునకు బంపెదవా ఇంతఃకూరమెంద రుసగలదా.

ఉ॥ అన్నవు నీవు, చెల్లెలికి నక్కట మాడలు చీర లిచ్చుటో మన్నన చేయుటో మధుర, మంజులభాషల నాదరించుటో మిన్నులప్రమోతలే నిజము, మేలని చంపకు మన్న, మానిరా వన్న సహింపు మన్న తగ, దన్న! వధింపకు, మన్న! వేడెద.

కం—ఓహో! నాప్రాణములు పోయినను నరియే, నీభార్య నీకున్న జాలును గాబోలు చాలు చాలు దూరముగా నుండుము నీ నీతివాక్యము లింకొకసారి చెప్పెదవుగాని లే.

(దూరముగా గెంటును)

దే—(భయోద్వేగముతో)అన్నా! అన్నా! యేమి యీవిపరీతము నాకి దియంతయు కలయా నిజమా, నేనేమితప్పు చేసితినని నీకింతయాగ్రహముగలిగినది. ఎన్నడయిన నీమాటకెదురు జవాబైన చెప్పి యెరుంగుదునే. సోదరా! నీకింతయనాదరణ మేల గలిగినది, మొన్ననే గదా "నీకు వివాహముచేసి గొప్పకానుకలతో నిన్నత్తవా

రింటి కంపెద" నని చెప్పితి. ప్రయాణమున కింతసన్నాహము చేసితివి. ఇంతలో నేయింత నీచాత్మురాలినిగా దలంచితే పసుపు బట్టలనైన విడువనిసోదరిని వధించుట తగునా.

కం—ఔరా యెన్నిమాటలు నేర్చితివి. ఏమియునెరుగనట్లునటించెదవా. నాప్రాణములకై నీప్రాణములు బలియొసంగెద. ఇన్నాళ్లు పెంచినందుల కీమాత్ర ముపకారము చేయ కూడదా. స్త్రీబుద్ధిః ప్రళయంకరీ అను వాక్య మెఱుంగ ననుకొంటివా. చాలు చాలు (కత్తినెత్తును)

వ—బావా ఆగు మాగుము. నాయీయొక్క మాటమన్నింపుము. నీవు నాకు పదిరాజ్యంబులు కానుకగా నిచ్చినట్లు సంతసింతును ఈ మనోహరాంగిని విడిచిపెట్టుము. ఇదియే నాతుదికోరిక.

కం—ఏమీ! ఎంత నేర్పరివి. నిన్నవివాహమాడిన నీకే యింతప్రేమ యుండగా నాప్రాణములపై నాకెంతమక్కువ యుండును. గాజులు తొడిగికొని యింట మూల గూర్చుండునాడుదానిని బ్రతికించి భూచక్రమంతయు గడగడలాడించు దోర్దండప్రతాపరాజమదమత్తేభకంఠీరవుండనగు నేను ప్రాణముల బాయువలయును గాబోలు. నీవీమెను గూడి కులుకుచుసంతోషమున నుందువు గాబోలు. చాలుచాలు నీపలుకుల నెవ్వరయిన విన్న నవ్వి పోదురు.

దే—సోదరా! నాయందింత కఠినుడవై యుండుట తగునా నిన్నే రాజమండలిలో పూజ్యునిగా భావించి కలలోనైన నీయానతి మీరక యుంటినిగదా చిన్నతనమాది చేతులార పెంచి పెద్దనుజేసి యిప్పు డింతదిక్కుమాలినదానినుగా చేయుట న్యాయమా నాయందించుక కరుణ వహించి రక్షింపుము నాప్రార్థన మన్నింపుము.

కం—నీవు వేయిమాటలు చెప్పినను నామనసు తిరుగదు ఎంత తెలివిహీనుఁడయినను చేతులార తిన్నఁ జావుకొనునా నిన్నుఁ చంపక విడువను. (మరల కత్తి నెత్తును.)

వ—(కత్తి పట్టుకొని)

మ॥ చెలియ ల్కన్నియ ముద్దరా లబల నీకే సేమంబె చింతించు ని
ర్మల దీని న్భయలాఘుమాటలకు నైకే మర్యాద పోగొట్టి స
త్కులజాతుండవు పుణ్యమూర్తి వకటా కే కోపంబు పాపంబు నె
చ్చెలి నోహో తెగవ్రేయ వాడి యగునే కే చింతించు భోజేశ్వరా॥

ఎంత కఠినహృదయుఁడైనను తాను వెంచినలతను తానే చేతులార నీకివైచునే మరియు.

మత్తకోకిల.

వావి చెల్లెలు గాని కూతురువంటి దుత్తమురాలు సం
భావనీయచరిత్ర భీరువు బాల నూత్నవివాహ సు
శ్రీవిలాసిని దీని గంపితచిత్త నీ కిదె మ్రొక్కెదం
గావవే వరుణామయాత్మక కంస మాన వల్లభా॥

కం—ఈమాటల కేమి లెమ్ము కత్తి విడువుము నాయుష్యమమును మరలించుటకు దేవేంద్రాదుల కయిన తరము గాదు.

వ—బావా నీశక్తి నే నెరుంగ ననియా తలంచితివి ఇంచుక తాళి నామనవి వినుము నామాటలను మన్నింపుము నీయానతి మీరి జీవింప గలవారెవ్వరైనం గలరా నిన్ను బ్రతిమాలుకొనుచుంటిని నామనవి చిత్తగింపుము. ఏదియో యొక వాక్యమును విన్నంత మాత్రమున స్త్రీహత్యకొడంబడుట పాపహేతువు గాదా. (ఆలుచూలు లేదు కొడుకుపేరు సోమలింగ మనినయట్లు నిన్న వివాహమయినకాంతయొక్క అష్టమగర్భమునిన్నుఁ జంపునన్న పలుకులు విశ్వసింపనగునా. ఎప్పుడయినను నట్టివింత గంటిమా. ఎన్న

డుమనిట్లు జరుగునా. ఎవ్వరయిన నమ్ముదురా. అదియునుం గాక ఒకరిప్రాణములతోడి సంబంధమింకొకరికి నెట్లు వచ్చును.

సీ॥ మేనితోడనుబుట్టు । మృత్యువుజనులకు
నెల్లి నేడైననూ । రేండ్లకయిన
దెల్లంబు మృత్యువు । దేహంబు పంచత
నందఁగర్మానుగు । డై శరీరి
మారుదేహముఁజొచ్చి । మఱియొంటిదేహంబుఁ
బాయును తనపూర్వ । భాగ మెత్తి
వేరొంటిపైఁ బెట్టి । వెనుకభాగం బెత్తి
గమనించుతృణజలూ । కయును బోలె

గీ॥ వెంట వచ్చుకర్మ । విసరంబు మును మేలు
కన్న వేళ నరుడు । గన్నవిన్న
తలపఁబడిన కార్య । తంత్రంబు గలలోనఁ
బొడితోఁచుగానఁ । బడినయట్లు
అదియుఁగాక

కం॥ కర్మమునకు మేలు నిచ్చెను
కర్మంబుల కీడు నిచ్చు కర్తయు డనరున్
గర్మములు బ్రహ్మ కయినను
గర్మగుణై పరుల దడవఁగా నేమిటికిన్.

ఓకంసరాజేంద్రా నీవెఱుంగని ధర్మంబులు గలవే అయినను వినుము స్త్రీహత్య మహాపాతకము గదా.

కం॥ కావున పరులకు హింసలు
గావింపగ వలదు తనకుఁ గళ్యాణముగా
భావించి పరుల నొంచినఁ
బోవునె తత్ఫలము పిదపఁబొందక యున్నే.





కం—ఊరకున్న కొలది నోరికివచ్చినట్లు ప్రేలుచుంటివి. నీబూటకపుమాటలు నమ్మి విడిచెద ననుకొంటివి గాబోలు. నాచేత కడ్డము రాకుము వచ్చినచో నీవుసహిత ముండవు. పొమ్ము నీప్రాణములను రక్షించు కొనుము.

వ—ఇంతి దారుణకర్మమును కన్నులార గాంచుటకంటె ప్రాణములుండి ఫలమేమి. ఎన్నడయిన నిట్టిదుష్కర్మము జరుగునని దలంచితివా ముందెన్నడో చెలియలి యష్టమగర్భంబున శిశువు జనించి చంపునని భయపడుచుంటివా. ఇంతటిభీరువు నెన్నడైనగంటివా. నీధైర్యమంతయు నేమయ్యె. నీయాజ్ఞ చెప్పిన దేవదానవు లెల్లరును శిరసా వహించి అంజలి యొగ్గుచుండ ముందెన్నడో బుట్టుబుడతడు నిన్ను జయించునని నమ్మితివా. తోడబుట్టినదానియందైన నించుక కరుణ జూపకుండుట న్యాయమా. ఇంతకఠినహృదయుడవయితివేల. అయ్యయ్యో యింతిపాపమున కొడిగట్టవచ్చునా. కావున నింకనయిన నాలోచింపుము.

కం—ఏమీ గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లు నాముందు బుట్టి నాకు హితోపదేశము జేయుచుంటివా. ఇంకను నేనాలోచింపవలయునా. చాలుచాలు తొలగుము లేనిచో నిరుప్పర నీక్షణముననే యమాలయమున కంపెదను.

(అనిక్రింద ద్రోయును. వసుదేవుడు లేచి దులుపుకొనుచు)

వ—(తనలో) అక్కటా! యెన్ని చెప్పినను ఈమూర్ఖుడు వినునట్లులేదు. తా బట్టినకుందేటికి మూడేకాళ్లనునట్లు చరించుచున్నాడు ఈ రాక్షసాధముని హృదయము రాతితో చేసినది గాబోలు. ఏయుపాయముచే నయిన నీగండము గడచిన బాగుండును. (ఆలోచించి) ఆ స్ఫురించినది

సీ॥ ఆపన్నురాలైన । యంగన రక్షించి
సుతుల నిచ్చెద నన్న । శుభము నేడు
మీ దేవ్వ జేరుగును । మెలత ప్రాణముతోడ
నిలచిన మరునాడు । నేరరాదె
సుతులు పుట్టిరయేని । సుతులకు మృత్యువు
వాలాయమై వెంట । వచ్చె నేని
బ్రహ్మచేతను నీడు । పాటేమియును లేక
యుండు నే సదుపాయ మొక్కటి లేదె।
గీ॥ పొంత బ్రామకుల గాల్పగ । పోయి వహ్ని
యెగసి దవ్వులవాని ద । హించు భంగి
కర్మవశమున భవమృతి । కారణంబు
దూరగతి బొందు నిదియేల । తొట్రు పడగ ॥

కావున
కం॥కొడుకుల నిచ్చెదనని సతి
విడిపించుట నీతి నీడు, విడచిన మీదం
గొడుకులు పుట్టిన కార్యము
తడబడదే నాటికొక్క దైవము లేదే॥

(ప్రకాశముగా) బావా కంసమహారాజా నా యీతుదిమనవి నాలకించి నీ యిష్టానుసారము ప్రవర్తించుము. నిష్కారణముగ స్త్రీహత్య కొడిగట్టకుము ఇటు వినుము.

కం—నీమనవులు గినవులు నావద్ద పనికిరావు. ఎంత చెప్పినను నీమెను చంపవలదని యే గదా ! చాలు చాలు ప్రాణము లన్న నందర కును నొక్కటియే. అది గాక క్షాత్రధర్మ మేమంటివేని వినుము,

ఆ॥వె॥ తల్లి దండ్రి నైన ♦ దమ్ముల నన్నల
నఖుల నైన బంధు ♦ జనుల నైన
రాజ్య కాంక్ష చేసి ♦ రాజులు చంపుదు
రవని దరుచు జీవి ♦ తార్థు లగుచు॥

నీ విన్ని చెప్పినను ఈ ధర్మ మిచట జరిగి తీరవలయును.

వ—(కన్నీళ్లతో) నే చెప్పెడి పలుకుల నైన వినకుండ నింతకఠనముగా మాట్లాడిన నేమన గలవాడను. నా పలుకుల నించుక విని యాలోచించవలదా! తరువాత విచారించిన ఫలిత మేమి.

కం—అట్లయినచో నీ చెప్ప బోవునది వేగ మోగింపుము. ఇంతలో నేమి మునిగిపోవునది గలదు.

వ—బావా వినుము నీవు సర్వం సహా మండల నాయకుండవు నీ కింత యపకృతి నాచరించుటకు దేవేంద్రాదు లయినను భీతి జెందుచుందురు. అట్టి నిన్ను నీ చెలియలి యష్టమగర్భము జంపునంట విశ్వసించితివా బావా! సరే అట్లే యగునని యనుకొందము.

కం—ఏమీ అట్లేయగునా చూడుము (కత్తి నెత్తును).

వ—(కత్తి పట్టుకొని) ఇంతలోనే యింత తొందరయేల కడవరకు వినుము. ముం దెప్పుడో గర్భముధరించి బిడ్డను గనినప్పుడు గదా! నీకు వానివలన భయము జనించుట. ఇంతట కార్యములు జరుగుట మున్నెన్నడయిన కని విని యెరుంగుదుమా! పోనిమ్ము అందుల కొక చిన్న యుపాయము నెరింగించెద వినుము.

కం॥లలనకు బుట్టిన ♦ కొమరుని
వలనం దెగెదనుచు గగన ♦ వాణి బలికె నం
చలిగెదవేని ♦ మృగాక్షికి
గల కొడుకుల జంపనిత్తు ♦ గ్రమముగ నీకున్.

గావున స్త్రీహత్యామహాపాతకముకూడ నేల పొందెదవు
ఇట్లు జరిపెదేని సోదరిని రక్షించినాడవని కీర్తి నొందెదవు.
నీ యుపకారమును బాసెదవు రెండుకార్యములును నెరవేరును
కావున నీరీతి నొనర్చి రక్షింపుము. ఇదే ముమ్మాటికిని కోరిక.

కం—(తల పంకించుచు తనలో) అగును ఈమెయష్టమగర్భమున
పుట్టి పెరిగి పెద్దవాడయినగదా నన్నుజంపుట. పుట్టుకతోడనే
చంపిన నేమి యపకారము వాటిల్లును. ఒకరిదోషమునకు నిం
కొకరిని జంపుట యేల. ఈ పద్ధతియే బాగుగా నున్నది. (అని
దేవకిని విడచి (ప్రకాశముగా) నీవిప్పుడు వలికిన పలుకులు
తప్పక జరిగించెదవా.

వ—ఇంకను జరిగించెదవా యనుచుంటివేమి నీమాట కెదురాడి
బ్రతుక దరమా! ఇప్పుడీప్రాణములను రక్షించితివేని ఆ
జన్మాంతము నీదాసులమై యుండకుందుమా తప్పక పుట్టిన
కొమరుని తక్షణమే నీ కప్పగించు చుండెదను రక్షింపుము.

కం—జరుపనిచో నన్నెరుగుదువా ఒక్కయేటున నిరువురశిరంబు
లెగురును

వ—ఆమాత్రము నేనెరుగనా (తనలో) యిప్పటి కీ గండము గడిచిన
నంతియే చాలును. ముందుసంగతికి దైవమే గలడు.

కం—సరియే యిప్పటికి విడచి పెట్టితిని పొండు.

(అని నిష్క్రమింతురు)

వ—అమ్మయ్యా! ఇప్పటి కీవిపత్సముద్రము దాటితిమి.

దే—నాథా మరల నేమి బుద్ధిపుట్టునో గృహమునకు బోదమురండు.

(ఇరువురు నిష్క్రమింతురు)

---



# కృష్ణలీల.

## ద్వితీయాంకము

### రంగము వీధి

చెరియొకదెస నుండి అక్రూరుడు, విజయుడు ప్రవేశించుచున్నారు.

వి—ఓహో యెవరు వారు అక్రూరుడా సంతోషము.

అ—విజయా యీ మధ్య నీవు పట్టణంబున లేనట్లున్నది. ఎచ్చటకు బోయితివి. విశేషము లేమి?

వి—విశేషము లేముగను. పొట్టకొరకు దేశాటన చేయక తప్పదు గదా! ఇక్కడి విశేషము లేమియో యెరిగింపుము వినియెదను.

అ—వెనుకటి సంగతి నీ వెరింగినదే గదా అనంతరము కొంతకాలము నకు దేవకీదేవి గర్భమును ధరించె.

వి—కోపమునిగినది. మరల నేమి యల్లరి జరిగినది

అ—వినుము అప్పుడ వసుదేవుండు

ఆ॥వె॥ సుదతి మున్ను గన్న ♦ సుతు కీర్తిమంతుని
పుట్ట దడవు కంస ♦ భూవరునకు
దెచ్చి యిచ్చె చాల ♦ ధృతిగల్గి వసుదేవు
డాస పడక గిత్య ♦ మందు నిలిచి॥

కం॥ పలికిన పలుకులు దిరుగక
పొలయక వంచనము లేక ♦ సుతుల రిపునకున్

గలగక నిచ్చిన ధీరుం
డిల వసుదేవుండు గాక • యితరులు గలరే॥

వి—అప్పు డా దుర్మార్గు డా బాలుని జంపెనా యేమి ?

అ—విన బోవుచు తొందర యేల ! అప్పుడు కంసున కెంత ధర్మబుద్ధి గలిగినదో చూడుము.

వి—ఏమన్నాడు. దుర్మార్గునకు సద్బుద్ధి గలుగునా.

అ—ఇంచుక పుణ్యలేశమువలన గలిగినది. అప్పుడు వసుదేవునితో నిట్లు వచించె.

ఆ॥ వె॥ కొడుకు నీవు మరల • గొనిపొమ్ము వసుదేవ
వెరపు లేదు నాకు • వీని వలన
నష్ట వీనికి భవ • దష్టమ పుత్రుండు
మృత్యు వంట వధింతు • మీద నతని॥

వి—తరువాత నేమి జరిగినది.

అ—ఏమి జరిగినదా జరగ వలసినదే జరిగినది వినుము.

సీ॥ ఒకనాడు నారదుం • డొయ్యన గంసుని
యింటికి జనుదెంచి • యేకతమున
మందలోపల నున్న • నందాదులును వారి
భార్యలు పుత్రులు • బాంధవులును
దేవకి మొదలగు • తెరవలు వసుదేవు
డాదిగా గల సర్వ • యాదవులును
సురలు గాని నిజంబు • నరులు గారని చెప్పి
కంసుడ నీవు ర • క్కసుడ వనియు

గీ॥ దేవమయుడు చక్రి • దేవకి దేవికి
పుత్రుడై జనించి • భూతలంబు

చెరుప బుట్టినట్టి ♦ చెనటి దైత్యుల నెల్ల
జంపు ననుచు జెప్పి ♦ చనియె దివికి॥

వి—అమ్మా నారదమహాముని యెంత పనిచేసినాడు. పుత్రికకు పుట్టిన బుద్ధి పుడకలతోగాని మానునా! తరువాత

అ—ఆమాట విని కంసుడు

మ॥ కలగం బారి మరంది చెల్లెలి నుద ♦ గ్ర క్రోధుడై పట్టి బ
ద్ధుల గావించి హరిం దలంచి వెస దో ♦ ర్దోర్వారు గన్నట్టి పు
త్రుల జంపె న్గురు నుగ్రసేను యదు ద ♦ ర్భోజాంధకాధీశు ని
ర్మలు బట్టెం గడు వ్రాలియేలె జల మా♦ర న్మార సేనంబులన్.

వి—హరిహరి యెంతమాట వినవలసి వచ్చినది.

అ—అనంతరంబు వినుము. ఆర్వురుకొడుకుల వధించి కంసుండు ఏడవ గర్భమునకై నిరీక్షించుచుండ నాశిశువు మాతృని సురక్షితం బయ్యె నెట్లంటేని భగవంతుం డగులక్ష్మీనాధుడు యోగమా యనుం బిలిచి నీ వాపిండమును రోహిణీగర్భంబున బ్రవేశపె ట్టవలయు నని యానతిచ్చిన మహాప్రసాద మని యయోగ నిద్ర యియ్యకొని చని.

గీ॥ దేవకీదేవికడుపులో ♦ దేజరిల్లు
దీప్తగర్భంబు మెల్లన ♦ దిగిచి యోగ
నిద్ర రోహిణికడుపున ♦ నిలిపి చనియె
కడుపు దిగె నంచు పౌరులు ♦ గలగఁబడగ॥

వి—సెబాసు మంచిపని జరిగినది. ఈపన్యాయము కంసుడు దెల్లమొ గము నైచెను గాబోలు.

అ—విను మాగర్భ మెట్లో గట్టెక్కెను ఇప్పు డెనిమిదవసారి గర్భము ధరించి యున్నది. ఈగండ మెట్లు గడచునో తెలియదు.

వి—ఇదియు భగవదనుగ్రహంబున తప్పక రక్షింపబడగలదు ఈదుర్మా
ర్గున కంతకాలము రాబట్టి యే యిట్టిదుర్బుద్ధి పుట్టినది.

అ—దేవకీదేవి యీయష్టమగర్భము ధరించినప్పటినుండియు నొలయు
క్క్రొత్త తేజస్సుతో ప్రకాశించుచున్నది బాధనమున నుండియు

సీ॥ విబుధులమోములు వెలవెల బారంగ
విమలాస్యమోము వెల్వెలుక వారె
మలయువైరులకీర్తి మాసి నల్లన గాగ
నాతిచూచుకములు నల్ల నయ్యె
దుష్టాలయంబుల ధూమరేఖలు పుట్ట
లేమయూరున రోమరేఖ మెరసె
నరిమానసముల నాహారవాంఛలు దప్ప
వనజాక్షి కాహారవాంఛ దప్పె.

గీ॥ శ్రమము సంధిల్లె రిపులకు-శ్రమము గదుర
జడత వాటిల్లె శత్రులు-జడనుబడగ
మన్కి రుచి యయ్యె బగతురు-మన్కు చొరగ
వెలదియుదర బులో హరి-వృద్ధిఁ బొంద॥

వ—విజయ! యిది యిట్లుండ నాకంసునిహృదయంబున దినదినంబును
భయము ప్రవర్ధమాన మగుచున్నది. ఆ కారణంబున నాతడు

ఆ॥ వె॥ పాపరానిదొడ్డ - పనిపుట్టె నికనెట్టు
లిందుముఖికి చక్రి - యెపుడు పుట్టు
పుట్టినపుడె పట్టి-పురుటింటిలో డెగ
జూతు ననుచు నెదురు-చూచు చుండె॥

వి—కానిచేటుకాల మాసన్న మయినది ఎల్లకాల మొకరీతి నుండు
నా ప్రొద్దు పోవుచున్నది పోదము రమ్ము.

[ఇరువురు నిష్క్రమింతురు.]

రంగము కారాగృహము.
(దేవకీవసుదేవులు బంధనములతో నుందురు.)
ఇంద్రుడు బ్రహ్మ శంకరుడు ప్రవేశము.

ఇం—(విష్ణు తేజస్సును జూచి) ఆహా యీ తేజస్సు జూడ సహస్రదివాకరు లుదయించిన ట్లున్నది ఇంత కాలమునకు మాకష్టములు బాపుటకై భగవంతున కనుగ్రహము గలిగినది గాబోలు చేతులు జోడించి (ప్రకాశ్యముగా) దేవాది దేవా లోకరక్షకా నీకంటె మాకు దిక్కెవ్వరు గలరు సమస్తలోకములు నీకంస హాతకుని బారి బడి యనేక కష్టము లందుచుండ చూచుచు నూరకుండుట న్యాయమా సాధువిప్రుల భయము బాపి సంతసింప జేయవలదా ఎంతకాల మని భరించి యుండగలము నీ వుపేక్ష వహించినచో మాకింకొకదారి గలదా నీమాయ నెరుంగుట కశక్తు లెవ్వరు?

సీ॥ సత్యవ్రతుని నిత్య ♦ సంప్రాప్తసాధను
కాలత్రయమునందు ♦ గలుగువాని
భూతంబులైదును ♦ బుట్టుచోటగువాని
నైదుభూతంబు లం ♦ దమరువాని
నైదుభూతంబులు ♦ నడగినపిమ్మట
బరగువానిని సత్య ♦ భావణంబు
సమదర్శనంబును ♦ జరిపెడివానిని
నిన్నాశ్రయింతుము ♦ నీయధీన

గీ॥ మాయచేత నెరుక ♦ మాలినవారలు
వక్రగతుల నిన్ను ♦ చేరుకొందు
రెరుగ నేర్చువిబుధు ♦ లేకచిత్తంబున
నిఖిలమూర్తు లెల్ల ♦ నీవకంసు॥

మరియునో దేవా

కం॥నీవారై నీదెసదవు
భావంబులు నిలిపి ♦ ఘనులు భయవిరహితులై
యేవిఘ్నంబులు పొందక
నీ వరయగ మెఱచోట ♦ నెగడుదు రీశా

బ్రహ్మ— తండ్రీ! జగన్నాయకా సమస్తభువనక్షేమంకరుండ వయ్యు నింతనిర్దయ వహించి లోకంబుల నింతకలత పెట్టుట న్యాయమా ఎల్లప్పుడు ను నిన్నె భజించుచు నిన్నే మానసంబున నెంచుచు నీనామస్మరణమే శరణ్యమని యోచుమునీంద్రుల నెందర నీకంసుడు బాధించుచున్నాడో గనుగొనుట లేదా నీవే యింతనిర్దయ వహించిన లోకంబులు వృద్ధిబొందు టెట్లు.

గీ॥ మంచివారి కెల్ల ♦ మంగళప్రద మయ్యు
కల్లరులకు మేలు ♦ గానియట్టి
తనువు లెన్ని యైన ♦ దాల్చి లోకమునకు
సేమ మెల్లప్రొద్దు ♦ సేయు దీవు॥

నారాయణా! ఇట్లెల్లకాలము గంటికి రెప్పవలె నీవు గాచుచుంటివి. గాని లేకున్నచో నీ ప్రపంచక మంతయు నామమాత్రావశిష్ట మయి యుండదా.

శం— రామా భక్తపరంధామా

మ! గురుపాఠీనమవై, జలగ్రహమవై ♦ కోలంబవై శ్రీనృకే
సరివై భిక్షుకుఁడవై హయాననుఁడవై ♦ మేన్మేదేవతాభర్తవై
ధరణీనాథుఁడవై దయాగుణగణో♦దారుండవై లోకముల్
పరిరక్షించిననీకు మ్రొక్కెద ♦ మిలాభారంబు వారింపవే॥

నీవు లేకున్నచో లోకంబులే లేనట్లున్నవి. నీగురు కృపాతిశయంబుచే జనాళి నెల్ల నోదార్చి దుఃఖములు వాపి సంతసింపఁ

జేయుము. నీకరుణావిశేష మున్నచో లోకంబు లీ క్రూరరాక్షసుల బారినుండి తొలఁగి సుఖింపఁగలవు.

క॥ ధరణీభారము వాయను
పురుషోత్తమ యభవ నీదు ♦ పుట్టువున భవ
చ్చరణాంబుజముల ప్రాపున
ధరణి యు నాకసము గాంచె ♦ దము నీకరుణన్.

ఇం—ఆపద్బంధూ! కృపాసింధూ! నీవు జనించి మమ్మొకదరి జేర్పకున్నచో మామాయాధిపత్యంబుల బాసి వనముల వెంట దిరుగవలసి యుండును. మాశక్తిసామర్థ్యము లన్నియు నీరాక్షసాధములమాయావాగురలం బడి తేజోవిహీనము లగుచున్నవి. ఇంతను పేక్షింప వీలులేదు.

బ్రహ్మ—లీలామానుషవిగ్రహా; ఇదంత యు నీయింద్రజాలము గాక వేరేమున్నది.

ఉ॥ పుట్టువు లేనినీ కభవ ♦ పుట్టుట క్రీడ యు కాక పుట్టుకే
యెట్టనుడున్ భవాదిదశ ♦ లెల్లను జీవములం దవిద్య దా
జుట్టుచు నుండు గాని నిను ♦ జుట్టునది౦ బలెంబొంత నుండియున్
జుట్టగ లేమిఁ దద్క్రియలఁ ♦ జొక్కనియొక్కటి కాదు వీశ్వరా

కావున ప్రజోపకారార్థ మవతరించి లోకంబుల జక్కపెట్టుము.

శం—నారాయణా.

కం॥ ఎఱిఁగినవారల మనుచును
గొలమాలినయెఱుక లెఱిగి ♦ గొండఱు నీపే
రెఱిఁగియు దలప గన్నొలరు
పఱతు రధోగతులజాడఁ ♦ బద్మదళాక్షా॥

ఇంకను నాలస్య మేల చేసెదవు లోకంబులు గడు బెగ్గిలి యున్నవి ఆపత్కాలంబున రక్షింప కుండ నుపేక్షించుట తగునా,

కం॥ ముచ్చిలి యున్నది లోకము
నిచ్చలు కంసాదిఖలులు ♦ నిర్దయు లేశ౯
మచ్చికఁ గావఁగ వలయును
విచ్చేయుము తల్లికడుపు ♦ వెడలి ముకుందా!

ఇం—(దేవకీదేవి నుద్దేశించి) అమ్మా దేవకీ! నీపూర్వపుణ్యమున భగవంతుఁడు నీగర్భమున నావిర్భవించుచున్నాఁడు ఇంక నీకష్టము లన్నియు గట్టెక్కును.

మత్తకోకిల.

తల్లి నీయుదరంబులోన ప్ర ♦ ధానపూరుషుఁ డున్నవా
డెల్లి పుట్టెడి గనుచే భయ ♦ మింత లేదు నిజంబు మా
కెల్లవారికి భద్ర మయ్యెను ♦ నింక నీకడు పెప్పుడు౯
చల్లగా వలె యాదవావళి ♦ సంతసంబును బొందగ౯॥

బ్ర—శంకరా! ఇంద్రా అటు చూడుఁడు దేవకికి నొప్పులు ప్రారంభమయినవి. అదిగో భగవంతుఁ డుదయించుచున్నాఁడు.

కం॥ పంకజముఖి నీళ్ళాడను
సంకటపడ ఖలుల మాన ♦ సంబుల నెల్లన్
సంకటము దోఁచె మెల్లన
సంకటములు లేమి దోచె ♦ సత్పురుషులకున్.

ఇంక మన మిట నుండుట పాడి గాదు. కావలివారు మేల్కొనకుండ మనము పోదము రండు.

(అందరు నిష్క్రమింతురు.)

తెరపడి తిరిగి లేచును.

(శ్రీకృష్ణుడు దేవకియొడిలో నుండును)

వ—(నిద్ర మేల్కొని యిటునటు జూచి తనలో) ఏమిది! ఈకారాగారమంత యు నింతకాంతిమంతము గా గానవచ్చుచున్నది. ఈ

యద్భుతకాంతు లేమి. కన్నులకు గూడ మిరుమిట్లు గొల్పుచు న్నది, ఇంతవింత యెన్నడయిన గంటిమే. (దేవకివంకఁ జూచి) ఈమెయొడియం దింతప్రకాశమానుం డగు బిడ్డ డెవ్వడు. ఇదం తయు నిజమా లేక నేను కల గనుచుంటినా. కన్నులు తుడిచి కొని పరికించి చూచి నిశ్చయము; నిశ్చయము భగవంతుడే నాకుమారుడై యుదయించినాడు. ధన్యుడను ధన్యుడను. అప్పు డశరీరవాణి పల్కినపల్కు లబద్ధములు గావు. తప్పక యీ కుమారుడే కంసాంతకుడగును ఇదిగో నీలమేఘశ్యామలవర్ణము. అవిగో శంకచక్రగదాద్యాయుధములు. ఆహా! నాజన్మ సాఫ ల్యము నొందినది. ఇంక నన్ను బోలు మానవమాత్రుం డెవ్వ డుండును, నాకీ కారాగారమే మాణిక్యవిరాజితసౌధంబై గన్పట్టుచున్నది, నా పురాకృతపుణ్యపరిపాకమే యింతకును గారణము. నాకింక లోపమెద్దియును లేదు.

కం॥ ఏ నిన్ను నఖిలదర్శను
జ్ఞానానందస్వరూపు ♦ సంతతు నపరా
ధీనుని మాయా ♦ దూరుని
సూనునిగా గంటి నిట్టి ♦ చోద్యము గలదే.

దేవా! నీమహిమ లెన్న నెవరితరము. నావంటిమూఢమానవున కేమి తెలియఁగలదు.

కం॥ అచ్యుత నీ మాయను మును
జెచ్చెర త్రిగుణాత్మకము గ ♦ జేసినజగము
న్జొచ్చినక్రియ జొరకుండువు
చొచ్చుట యును లేదు లేదు ♦ చొర కుండుటయున్.

కం॥ సర్వము నీలో నిదిగా
సర్వాత్ముడ వాదివస్తు ♦ సంపన్నుడవై

సర్వమయుఁడ వగు నీకును
సర్వేశ్వర లేవులోను ♦ సాధులు వెలియన్.

నిన్ను దలంచినకొలఁది మనం బుత్సహించుచున్నది.

సీ॥ గుణము వికారంబుఁ ♦ గోరికయును లేని
నీవల్ల జగములు ♦ నెరి జనించుఁ
బ్రబ్బు లేదగునంచుఁ ♦ బలుకుట దప్పగా
దీశుండవై బ్రహ్మ ♦ మీవయైన
నిను గొల్చుగుణములు ♦ నీయానతులు సేయ
భటులు శౌర్యంబులు ♦ పతికివచ్చు
పగిది నీగుణముల ♦ బాగులు నీవని
తోచును నీమాయ ♦ తోడ గూడ

గీ॥ నీవు రక్తధవళ ♦ నీలవర్ణంబుల
జగము సేయ గావ ♦ సమయ జూడ
దనరు దట్లు నేడు ♦ దైత్యుల దండింప
పృథివి గావ నవతరించి ♦ తీశ.

దే—(సంతోషముతో తనలో) నాబాలు నాకారముఁ జూడఁ జూడ భగవదంశసంభూతుఁ డితఁ డని తప్పక గోచరించును. లేనిచో నీభుజకీర్తు లెట్లు వచ్చును. ఈశంఖచక్రము లెట్లు నిర్మితము లగును. నాపుణ్యఫలముచే నారాయణుండు నాగర్భమున నవతరించి నాడు. (బాలుని ముద్దు పెట్టుకొనుచు) తండ్రీ! నీవు విష్ణ్వంశసంభూతుండవు గాని మానవమాత్రుండవు గావు. నీ చైదము లెరుంగ శక్యమే.

ఉ॥ విశ్వము లీల ద్రిప్పుచు న ♦ విద్యకుఁ జుట్టము నైననీకు నా
శాశ్వత మైనకాల మిది ♦ సర్వము వేడబ ముందు రట్టి వి

శ్వేశ్వాగ; మేలుకుప్ప నిను నెప్పుడు గోరి భజించువాఁడె పో
శాశ్వతలక్ష్మి మృత్యుజయ సౌఖ్యయుతుండభయుండు మాధవా.

మరియు

విలయకాలమందు విశ్వంబు నీపెద్ద
కడుపులోన దాచు కడిమిమేటి
నటుడ వీవు నేడు నాగర్భజుఁడ వౌట
పరమపురుష వేడ్క బంబు గాదె.

తండ్రీ! నీపుట్టువు మున్నే యశరీరవాణి యెఱింగించె.

తరల

నలినలోచన! నీవు నిక్కము నాకుఁ బుట్టెదవంచు నీ
ఖలుఁడు కంసుఁడు పెద్దకాలము కారయింట నడంచె దు
ర్మలినచిత్తుని నాజ్ఞసేయుము మమ్ము గావుము భీతుల
న్నలుసు లేక ఫలించె నోచిన నోము లెల్లను నీవయై.

వ—తండ్రి

శా॥ మింట న్మ్రోసి సమోత్రత తొలిమిని లోక మోడింప ము న్నీవు నా
యింటం బుట్టెద వంచు కంసుఁడు దోడికిన్ హింసించె నీయన్నలన్
గంటం గూరుకు తేఁడు నీయుదయ మీకారాజను ల్సెప్పఁ గా
బంటింపం డెదు రేగు దెంచు వడి నీపై నేను సన్నద్ధుఁడై.

కావున నెట్లు రక్షింతువొ యెఱుంగకున్నవాఁడ. ఇప్పుడాల
స్యముఁ జేయ కార్యము గాదు ప్రసన్నుండవగుము.

కృ—పెద్దయైగను పట్టును. (దేవకీవసుదేవుల జూచి) అమ్మా! నేను
నారాయణుండ నగుట నిక్కువంబు. తొల్లి నీవు పృశ్ని యను
మహాపతివ్రతవు. ఈతండు సుతపుం డను ప్రజాపతి. అనేక
సహస్రదివ్యవర్షంబులు మీరలిరువురు నానిమిత్తమయి
తపంబు సేయ నే నపుడు ప్రత్యక్షమై వరంబు గోరు మన

బిడ్డలు లేనివార లగుట నావంటికొమరు నీవ్మని గోరినంత నప్పుడు మీ కేను పృశ్ని గర్భుం డనునర్భకుండ నై జన్మించితి. తరువాత

కం॥ అదితి యు గశ్యపుఁ డనఁగా
విదితుల రగు మీకు గురుచ వేషంబున నే
నుదయించితి వామను డన
త్రిదశేంద్రానుజుడనై ద్వితీయభవమునన్.

కం॥ ఇప్పుడు మూ డవ బామునఁ
దప్పక మీరిరువురకును దనయుఁడ నైతిన్.
జెప్పితి పూర్వము మీయం
దెప్పటికిని లేదు జన్మ మిట్టుపై నాకున్.

కావున నొక్క విషయం బెరిగించెద వినుడు. నాచే ననుజ్ఞాతయైన యోగమాయ వ్రేపల్లెలో నందునిభార్య యగుయశోద గర్భమున నుదయించినది. కావున వేగ నన్ను దీసికొని పోయి యాబాలిక శయ్యయం దునిచి యయోగ్యగమాయ నిటకు దోడ్కొని రమ్ము. పోమ్ము తదనంతరంబ జరుగుకార్యములు మీకే విదితమగును.

(అని బాలకాకృతిని ధరించును.)

దే॥ నాథా! చూచితిరా! భగవన్మాయ భగవంతునకు మనయం దెంత ప్రేమయో యెరింగితిరి గదా చూడు డప్పుడే బాలకాకృతిని ధరించినాడు.

వ—కాంతా! అప్పుడే మూడవయామము నడచుచున్నది వేగక భగవదాదేశము నెరవేర్పవలయును జాగుచేసిన నాటంకములు గలుగు నేమో (అని బాలు నెత్తుకొని బోయి) కటకటా! యీ శృంఖలాబద్ధుండనై యె ట్లేగ గలవాఁడను భగవదాదేశము

నట్లు నిర్వర్తించఁగలవాఁడను అన్నిటికిని భగవంతుఁడే గలఁడు (అని బాలుని స్పృశించుట సభినయించి) ఆహా భగవన్మాయ బంధనము లన్నియు నిట్లూడి యున్న వేమి భగవంతునకు నా యం దున్నయనుగ్రహమే యింతకును కారణము బాలు నెత్తి కొని (ఆశ్చర్యముతో) యిది యేమివింత యీకారాగారకవా టము లిట్లు దెరచి యున్నవి (అని ముందునకు వచ్చి) యీభటు లందరు ను జీవచ్ఛవములవలెఁ బడి మైమరచి యున్నారు ఇచ్చటనుండి దాటి పోవుటకు నిదే మంచిసమయము భగవా నుని యనుగ్రహ మున్నచో నేమియడ్డంకులు రాఁగలవు? (ముందునకునడచును) (వెనుక తెర పడును.)

(ముందుచూచి అక్కటా! యెట్లెట్లో గండము లన్నియు గడచి వచ్చితిఁ గాని యీయర్ధరాత్రంబున నీయమునానదిని గడచి యవ్వలకు జేరుట యెట్లు (విచారముతో భగవదధీనము గాని కార్యము లుండునా (విచారముతో) తల్లీ! యమునా! భగ వంతునియాదేశమున వచ్చుచుంటి నన్నవ్వలిదరిఁ జేర్పుము. నదీమధ్యముల (త్రోవ గన్పట్టును ధన్యోస్మి (ముందునకు నడ చుట నభినయించి) అదిగో వ్రేపల్లె. అల్లదిగో. నందునిగృహము వేగ నీబాలుని యశోదశయ్యపై నునిచి యెవ్వరు ను మేల్కొన కుండ నా బాలికను ఎత్తుకొని వచ్చెదను తల్లీ!యమునా! నదీమ తల్లీ! యీమార్గ మిట్లే యుంచుము మరల నే నిప్పుడే వచ్చెద.

(నిష్క్రమించును.)

[వసుదేవుడు మరల బాలికతో ప్రవేశించి తనలో']

ఎట్టులో యింతవరకు కార్య మవిఘ్నము గా సాగినది. కావున మరలి యీబాలికను గైకొని వేగ నాకారాగారంబున కరిగి దేవకిచెంత నీబాలిక నిడి యేమి యు నెరుంగనట్లు నటించెదఁ

(అని చుట్టు తిరుగుచుండును) ఈ కారాగారమున నింకను మెళ్వరును మేల్కొనలేదు (అని చరచర లోనికి నడచును) తలుపు లన్నియు నెప్పటియట్లు బంధింపఁబడును. (సంతోషముతో) ఈసంగతి యెవ్వరికిని తెలియదు; నాబిడ్డ కింకేమియు భయములేదు దేవకి నిద్రించుచున్నది ఈ బాలిక నీమె పార్శ్వమున పరుండఁబెట్టెదను (అట్లుచేయును.) ఇంక నీనాకెలలను తగిలించుకొందుఁగాక (అట్లు చేసి యెప్పటిరీతి నుండును.) (బాలిక పెద్దగా రోదనము సేయును)

(నిదురించుచున్న కావలిభటులు లేతురు)

తా॥ కే—కన్నులు నులుముకొనుచు లేచి పిల్ల పుట్టింది గామోను ఊరికే వసదాగినపిట్టలా అరుత్తూంది దిక్కుమాల్నాళ్లని కాయలేక కళ్లడి మోతున్నాయి తెల్లవార్నియ్యకూడదూ యింతలో నేఝుంత నోలెత్తాలా బేగి సెప్పక పోతే ఆయన్నసంపేత్తాడు (తక్కిన వాండ్రను లేపుటనభినయించి) ఓరే! జంఘూలూ, ఒరే! శార్దూలమొఖమూ ఒరే దంతకార్రి లేవరేంరా కొంప మునిగిందర్రోయ్ (అని ఒకనిమీద బడికొట్టును.)

జం—లేచి అయ్యో బాబో దెయ్యం గొట్టింది అని గంతులువేయును

యు—నీయిల్లు వల్లకాడు గాను దెయ్యం గాదు దేవతా గాదురా నేన్నా దేవకమ్మ నీళ్లాడింది గామోలాన్ను పిల్లేడు పినమట్టం లేదంట్రా

జం—నాకు కలే రాందే యినమట్టానికి.

తా—ఓరి! దున్నమోంతా కల్లో యినముకుందట్రా అని నెత్తి గట్టిగా బట్టుకొని యిను యీపాలి యినమడుతూందో లేదో.

జం—అవు నోయ్ యెంత శేపయుందేంటి రాజుగారితో సెప్పకపోతే సంపేత్తాడుసుమూ పద పద,

తా—ఒరే! యీాళ్లిద్దరూ బోరెంపోతుల్లాగ బడి దొల్లుతూంటే మన మెల్లి సెప్పడమేంఆళ్లని లేపి పంపిద్దాం లేపు.

జం—ఒద్దురా ఒద్దురా యిలాంటివి సెపితే రాజుగారు బవ్రుమతీ యిత్తారురా ఝ తళముపడి ఆబవ్రుమతీ యీాళ్లకి మాగొట్టడవేం మనవే తెచ్చుకుందాం నడు.

(తక్కినవాండ్రిరువ్వురు లేచి) గాడిదకొడకల్లారా. బవ్రుమతీ అంతా మీారే దొబ్బుదాం అనుకున్నారా? ముందు మేవే యెల్లి సెపతాం (అనియిరువురును పరిగెత్తుదురు.)

జం—ఒరేయ్! మనం గూడా యీాళ్ళకన్న ముందు పరుగెట్టుకెలదాం రా రా (తక్కినయిరువ్వురుపరుగెత్తుదురు)

తెరలో!

నీకుంపతెగ ముందెలుతూంటే పడగొడతావురా.

మరల తెరలో!

అయ్యబాబోయి కాలిగ్గొట్టేసినాడ్రో సచ్చిపోతాన్రోయ్

నిష్క్రమింతురు.

రంగము కారాగృహసమీాపము.

ఖడ్గహస్తుడై కంసుఁడును మంత్రులు మొదలగు పరివారమును ప్రవేశించుచున్నారు.

కం—ఏమిరా తామ్రకేశా ఎంతసేపయినదిరా మీారు చూచి.

తా—చిత్తం చిత్తం యిప్పుడేనండి బాబూ సూడ్డంతోనే పరుగేసుకొచ్చాం మారాజా.

కం—నీవు చూచితివిరా నిజము చెప్పు,

జం—లేదండి లేదండి యీాడు సెప్పాడు బాబూ.

కం—వెధవా చూడకుండ చెప్పుటకువచ్చితివిరా? (తన్నును)

తా—సామీా పిల్లేడుపు యినమడి యీాళ్లను లేపినానండి ఆకాడినుం

చి సామోరు దగ్గిరికి వచ్చామండి అదిగోనండి ఏడ్పు వినవ డుతూంది సూడండి. (పిల్ల యేడ్పు వినబడును)

(ఏడ్పు విని కంసుడు రౌద్రాకారముతో) ఇన్నాళ్లకు నా మనశ్శల్యము పోవునుగాక. (అని మంచమునకు నడచి దేవకియొడిలో నేడ్చుచున్న పాపను లాగ బోవును.)

దే—అన్నా యెంతపాపమునకు వొడిగట్టుచుంటివి నాయొక్క వాక్యమాలించి నన్ను మన్నింపుము నాయందు గల ప్రేమ యంతయు నేమాయెను.

కం—నీబూటకపు యేడ్పులకు నేను కరుణించువాడను గాను ఆబాలునిటు వెయ్యి నాఖడ్గమునకాహారము చేసెదను.

దే—అన్నా కంసమహారాజా.

ఉ॥ అన్న శమింపు మన్న తగ • దల్లుడు గా డిది మేనగోడలా
మన్నన సేయు మన్న విను • మానిని జంపుట రాచపాడి గా
దన్న సుకీర్తివై మనగ • దన్న మహాత్ములు వ్రావృశోత్రన బో
వన్న భవత్సహోదరి గ • దన్న నినున్ శరణంబు వేడెదన్.

కం—దుర్మార్గురాలా నీయన్న ప్రాణములకంటె నీశిశువుప్రాణము లెక్కువ యని దలంచితివి నాబోలు నిన్నన నేల యింతకాల మూరకొనుట నాదే పొరపాటు ఇచ్చెదవా లేదా యని లాగి పట్టుకొనును.

దే—అన్నా అన్నా యించుక ముందు వెనుక లాలోచింపుము కార్యము మీరినయనంతరము విచారించిన ఫలితము లేదు నీవు పెట్టినభిక్షగా దలంచి చిరకాలము నిన్నే దలంచుచుండెదను.

కం॥ కట్టా యీర్వురకొడుకుల
బట్టివధించితివి యాడు • బడుచిది కోడల్

కొట్టన జంపగ వలెనే
కట్టసితి గనన్న యన్న • కరుణింపగదే.

అన్నా పుత్రుండయినచో నీకు సంతోషముగానే యిచ్చి యుందును గాని యీపసికూనవలన నేమి యుపాయము రాగలదు.

కం॥ పుత్రుండు నీబ్రదుకునకును
శత్రుండని వింటి గాన • సమయింపఁదగున్
పుత్రులకు నోచ నయితిని
పుత్రీదానంబుఁ జేసి • పుణ్యము గనవే.

అన్నా యీయాడుపడుచు నైనను నాకు విడిచి పెట్టగూడదా.

కం—పాపచిత్తా దుష్టా యెన్నిసాకులు చెప్పినను నాయంశమునే గోరుచుంటివి ఈపసికూనకొరకై బ్రాతృమరణము నాసించుచుంటివి గాబోలు అష్టమగర్భ మేదియైన నేమి హరించు నని జెప్పెగదాయిది బాలిక యైనను చంపక విడువను.

దే—సోదరా యీపసికూనను దయచేసి పుణ్యము గట్టుకొమ్ము. బాలికను పుచ్చుకొన బోవును.

వ—బావా యీబాలికచే నీ కేమి కీడు గలుగగలదు ఇదివర కార్గురజంపితివి గదా ఈయాడుపిల్ల నైనను విడిచి పెట్టుము.
(అని అడ్డ మేగును.)

కం—(ఇరువురను చెరియొకప్రక్కకు గెంటి వైచి) దుర్మార్గురాలా మిమ్ముల నాడు రక్షించినందునకా యింత పొగరుమోతుతనము బలిసినది ఒక్కబాలికప్రాణంబులకై రారాజుమరణంబున కిచ్చగించితిరే ఇంతకుటిలబుద్ధు లని దెలిసి యున్నచో నానాడే మిమ్ముల జముని కతిథులుగా జేసి యుందును ఇంతకు సంతసింపక యీరీతి యల్లరి చేయుదురా మిమ్ముల గూడ నీశిశువుతో జంపివై చెదను (క్రోధజనిలింపించును).

దేవకీవసుదేవులు హా యని భూమిపై బడుదురు.

కం—(తక్కినవారలను జూచి) చూచితిరా యీచోద్యము యీపసిపాపప్రాణములకై నాచావున కిచ్ఛగించుచున్నారు అని కత్తి నెత్తి బాలిక నీడ్చి క్రింద బడవేయ నాబాలిక క్రింద బడక యాకసమున కెగసి కాళికామూర్తి యై కనుబడును (నిర్విణ్ణుడై ఖడ్గమును క్రింద బారవైచి తనలో) ఆహా యేమి యీయాశ్చర్యము బాలిక యనుకొంటిని గాని భద్రకాళి యైన దేమి తా నొకటి దలప దైవ మింకొకటి దలచెనన్నట్లు జరిగినది అదిగో యేమి యో పలుకుచున్నది (ఆకసమువంక జూచుచున్నాడు అందరును చూతురు.)

ఆకసమునుండి

ఓరోరి దురాత్మా కంసదానవా బాలఘాతకా నీ క్రూరకృత్యములకు ఫలం బనుభవించెదవు లెమ్ము.

ఉ॥ తెంపరివై పొరిం బొరిని ♦ దేవకిబిడ్డల చిన్నికుఱ్ఱలన్
జంపితి వింక నైన నుప ♦ శాంతి వహింపక రాలమీద స
న్త్రాంపితి విస్సిరో ఖలుని యము ♦ బీరమె నాసరస న్జనించి నీన్
ఓరోరికంసహంత కావినుము.

జం పెడివీరు డొక్కడెన సత్కృతి ♦ నొందెడు వాడు దుర్మతీ.

(అంతర్ధాన మగును.)

కం—(హాతోస్మి యని క్రింద పడి లేచి) అక్కటా! యీభద్రకాళీవాక్యము లమోఘము లనియే తోచుచున్నది విధివిధాన మలంఘ్యము గదా అక్కటా! నే నెంతిపాపకార్యమున కొడి గట్టితిని నాయట్టికులఘాతకుడు ప్రపంచమున గలడా? కటకటా దేవకీవసుదేవుల నెంతబాధించితిని ఈపాపఫల మెంత కట్టి కుడుప కున్న

డునా [ఆదరముతో కన్నుల నీరు నించుచు దేవకీవసుదేవులసం
కెళ్లలు తీసి వైచి యిరువురవైపు తిరిగి సోదరీ బావా.

ఉ॥ పాపుడ బాలఘాతకుడ ♦ బంధువిరక్తుడ దుష్టచిత్తుడన్
గోపనుడన్ జరన్మతుడ ♦ క్రూరుడ బ్రాహ్మణహంతభంగిమీ
పాపల జంపితిన్ బయుల♦ పల్కుల నమ్మితి సాధులార నా
పాపము లుగ్గడింపక కృ ♦ పాపరులై కనరే శమింపరే

సాధులారా విధివిధాన మట్లు జరిగినది గాని నే జేసిన దేమి యును లేదు
వినుడు.

కం॥ పగతుర జెరచితి ననుచును
పగతురచే జెడితి నసును ♦ బాలుఁడదలచున్
పగచెలుములు లే వాత్మకు
బగచెలుములకీలు కర్మ ♦ బంధము సుండీ.

వ.—(తనలో) ఇప్పు డెన్నిధర్మంబులు వాక్రుచ్చుచున్నాఁడు ఇప్పుడు
వీని కనుకూలంబు గా నే ప్రవర్తింపవలయు.

కం—అయ్యలారా!

ఒక్కడ బ్రాణు లందరు ని ♦ జోచితకృత్యంబు లోలి త్రిప్పగా
నొక్కొక మేనునం బొడమి ♦ యొక్కొకరిత్రోవల రాకపోకలం
జిక్కుల బొందు చుందురు ♦ చేరరు సంసృతితోడ బాయలే
రెక్కడిహంత మీశిశువు ♦ లెక్కడిహన్యులు నూర నేటికిన్.

సోదరీ నే చేసినకృత్యముల మరచి నను క్షమింపుము.

దే—సోదరా కాలవైపరీత్యమునకు మన మేమి చేయగలము.

కం—బావా వసుదేవా ఊరడిల్లుము.

వ—విచార మేల.

శా॥ బావా నీవచనంబు నిక్కము సుమీ ♦ ప్రాణు లజ్ఞానులై
నీ వే నంచును లోభమోహమదభీ ♦ నిర్మిత్రతామోదశో

కావేళంబుల నొండొరుం బొడతు రే కాకారుడై సర్వరా
పావిష్టుం డగుసీశ్వరుం దెలియ లే రన్యోన్యవిభ్రాంతులై.

ఇంతకు నీయొనర్చిన దేమి గలదు భగవద్విలాస మనంతము గదా!

కం—బావా యింక మీరాయిరువురును మీయిష్టానుసారంబుగా సుఖం బుండుడు సౌధంబున కరుగుడు.

[దేవకీవసుదేవులు నిష్క్రమింతురు,]

మహామాత్యా మంత్రులారా వింటిరి గదా యీభద్రకాళివాక్యములు. ముం దెట్లు జరుగబోవునో తెలియుట లేదు ఇంతవిపరీతము జరుగు నని కలనైన నెఱుంగ నయితిని. నిష్కారణముగా దేవకీవసుదేవుల బాధించితి.

మహా—దేవా యేల విచారించెదరు స్వప్రాణరక్షణార్థము ఎన్నిక్రూరకార్యము లొనరించినను దోషము లేదు.

కం—మంత్రులారా యిట్టిభయవాక్యములు వినుచు నిర్విచారముగా నుండుట యెట్లు.

మ—రాజేంద్రా యీమాత్రమునకే విచారింపవలయునా! యెచ్చటనో బాలకుడై పెరుగుచున్నా డని గదా భద్రకాళివచించినది గావున

కం॥ అట్టయిన దడవ నేటికి
పట్టణముల మందలందు పల్లెల నెల్లన్
బుట్టెడి పెరిగెడి శిశువుల
బట్టి వధించెదము నమ్ము బంపు మధీశా.

2 మం—ఈయుపాయము మిక్కిలి శ్రేయస్కర మయినది. ఎప్పుడును శత్రువును మిగిల్చి యుంచుట తగదు. మిగిల్చినచో రజ్జువే పామై కరచుచుండును. రణశేషము ఋణశేషము శత్రుశేషము నుంచగూడ దని పెద్దలు వచించుచుందురు. కావున

మ॥ భవదీయోజ్జ్వల బాహుచాపవిలస ౹ ద్బాణావళీభగ్నులై
దివిజాధీశ్వరు లెక్రియం జనిరొ యే ౹ దేశంబులం డాగిరో
శివునిం జొచ్చిరొ బ్రహ్మ జెందిరొ హరిన్ ౹ సేవించిరో మానవృ
త్తి వనాంతంబుల నిల్చిరో మనము శో ౹ ధింపం దగున్ వల్లభా.

మహా— నిశ్చయము దేవత లతికుత్సితులు అనేకమాయోపాయము లెరింగినవారలు ఇప్పుడెంత మనకు లొంగి యున్నను

కం॥ నొచ్చిరి శాత్రవు ౹ లనుచును
విచ్చలవిడి దిరుగ వలదు ౹ వివిధాకృతులన్
ముచ్చిలి వత్తురు ౹ వారలు
వచ్చినయందాక మరువ ౹ జన దధిపునకున్.

అందునకు ఆమాయకాడగుచక్రి నంతంబు నొందించువరకు మనము గుండెలపై చేతులు వైచుకొని హాయిగా నిదురించుటకు వీలు లేదు.

మ॥ అమరశ్రేణికి నెల్ల చక్రి ముఖ్యుం ౹ డా చక్రి ధర్మంబునం
దమరు న్గోవులు భూమిదేవతలు ధీ ౹ ఆమ్నాయకారుణ్య స
త్యములున్ యాగతపోదమంబులును ౹ శ్రద్ధాశాంతులు న్విష్ణుదే
హము లిన్నింటిని సంహరించిన నతం ౹ డంతంబు నుం బొందెడిన్.

కం— మంత్రిసత్తమా నీ వనినది నిశ్చయము. నాచే నోడింపబడిన యమరు లందరును చక్రిసాహాయ్యంబున నన్నెట్లయిన నంత మొందింప ప్రయత్నించుచున్నట్లు వెనుక నారదుండెరింగించెను. కావున నాచక్రిసహితముగా దేవతల నంత మొందింప వలయు లేనిచో నెప్పటికైన నపకారము చేయక మానరు గావున నో మంత్రులారా

సీ॥ బ్రాహ్మణసేవయు ౹ భగవదారాధన
నెంచువారలను బా ౹ ధించవలయు

ఆశ్రమధర్మంబు § లడుగంటునట్టుగా
ధ్వంసంబు గా జేసి § దవరవలయు
నరతపోధనులను § బలుబాముల నెట్టి
బ్రాహ్మణత్వ బును § బాపవలయు
పుణ్యతీర్థంబులు § పుణ్యాశ్రమంబులు
చెరిపి ధ్వంసంబుగా § చేయవలయు

సీ॥ దేవతల నెల్ల పట్టి బా § ధింపవలయు
అష్టదిక్పతులను వారి § యనుచరులను
బ్రహ్మవిష్ణుమహేశుల § పంతమునను
నొంచి కారాగృహంబున § నుంచవలయు.

2 మం—ఇంతకన్న మహాభాగ్య మేమి కావలయును.

ఉ॥ చంపుదుమే నిలింపులను § జంకెల రంకెల తాపసాపళిం
బంపుదుమే కృతాంతకునిపాలికి § క్రోపులతోడ గోవులం
ద్రుంపుదుమే ధరామరుల § దోలుదుమే నిగమంబుల న్విదా
రింపుదుమే వసుంధర హ § రింపుదుమే జననాథ పంపుమా.

కం—ఓమంత్రులారా నాయాజ్ఞ గా మనచమూనాయకు లందర తోడను నిర్వర్తమానం బెరిగించి దేశంబు లన్నియు గాలించి వెతకుమని యెరిగింపుడు. పూతనాదిరాక్షసులకు గూడ దెలుపుడు. ఏయుపాయముచేతనయిన నాహరినిం బొందించి సంతోషపరుపుడు.

మం—చిత్తము చిత్తము అట్లే యొనరింతుము.

కం—కాల మతిక్రమించినది పోదము రండు.

అందరు నిష్క్రమింతురు.

తెరపడును.

---



# కృష్ణలీల.

## తృతీయాంకము

రంగము నందునిమందిరము

తొట్టెలో కృష్ణుడు నిదురించుచుండును.

రాధ, యశోద రోహిణి కమల మొదలగువారలు కూర్చుందురు'

క—ఏమమ్మా యశోదా! నీపుణ్యమే పుణ్యము నీభాగ్యమే భాగ్యం పూర్వజన్మమున నెంతతప మాచరించితివో గాని లేకున్న నింతసుందరాంగుడు పుట్టునా.

రా—ఏమే యీయందమునకే యెంతకులుకుచున్నావే అందమన్న అందమా బొగ్గులలో రామచిలుక.

య—పోనీలెద్దూ మాకంద మేల ఇంత బ్రతికి బట్ట గట్టి బాగుండిన నంతియే చాలును.

రో—రాధ మనబాలకృష్ణుని మేనత్త గదా. ఎంతయందవిహీను డయిన నేమి. అల్లునకు అత్తకు తప్పునా.

రా—ఊరకే అందును గాని గోపాలకృష్ణుని విడచి యొక్కక్షణ మయిన నుండగలనా.

య—ఇంత కురూపు డయినపుత్రుని గనినందులకు హేళన చేయుచుం టివా పోనిమ్మా కాకిబిడ్డ కాకికిముద్దు.

రా—వదినా హాస్యమున కన్నమాటల కింత కోపము రావలయునా

య—నా కేమి కోపము వచ్చినది. ఎట్లున్నను ఎవరిబిడ్డ వారికి ముద్దు అని నే నన్నాను ఇంతేగదా.

క—ఎందుకమ్మా మీరు గుర్రుద్దు లాడెదరు. ఉన్నయందు మొక్కడి కయినను బోవునా రాధ కల్లుడు గనుక వేళాకోళములాడుచుం దును ఆమాత్ర మనువారు మాత్ర మెవరుగలరు.

రా—కమలా మనవా రదిగో పాలకావిళ్లతో మందలనుండి యింటికి వచ్చుచున్నారు. పోదము వచ్చెదవా.

క—అలాగే నడు యశోదా ఆనక మరల వచ్చెద మమ్మా. మగవా రిండ్లకు వచ్చుచున్నారు. పోయి వచ్చెదము.

య—అప్పుడే వెళ్లెదరటే పోనిండు మధ్యాహ్నము తప్పక వచ్చెదరా

రా—వదినా మాకు మాత్ర మేమి పని గలదు. ఆలాగే వచ్చెదము లే

య—రాధా కమలా మధ్యాహ్నము మనచిన్నికృష్ణునకు జన్మదినోత్స వము చేయవలయు మీరు రాకున్న చో నాకు సంతోషము గలుగదు తప్పకుండా రావలెను సుండీ.

[రాధా కమలులు నిష్క్రమింతురు]

[దూరముగా పూతనప్రవేశించును.]

పూ—(తనలో) అక్కటా ఎన్ని దేశములు దిరిగితిని. యెన్నిగృహములు వెదకితిని. ఎచ్చటను ఆకంసునివిరోధి యగు బాలకుడు గాన నగుట లేదు. ఈపల్లెయం దెచ్చటనో యున్నట్లు సమాచార మించుక డెలిసినది. ఇందాక గొల్లపడుచులు కొందరు మనయ శోద చిన్నమగవాని గనె నటచూచి వత్తమమ్మ సుదతులార యని చెప్పుకొనుచుండిరి. ఆబాలుడే యీబాలుడై యుండు నేమో చూచి వచ్చుట మంచిది [ఆలోచించి] ఈరూపముతో నటకు బోవుట మంచిపని గాదు. సుందరివేషముతో నేగి

యనుకాంతకుడే యయినచో అంతకునిసన్నిధికి బంపి వచ్చెదను. [తెరలోని కరిగి సుందరివేషముతో ప్రవేశించును.] అదిగో యశోదాగృహము. దగ్గర కేగి చూచెదను గాక. [ముందునకు నడచుచున్నది.]

రో—అక్కా చూచితివా ఆవచ్చుచున్న కాంతను ఏమి దాని యొయ్యారము. ఎంత చక్కదనము.

మత్తకోకిల

కాలుకన్నులు గుబ్బచన్నులు గందుప్రొందనిచందురుం
బోలుమోమును గల్గులేదను బుద్ధిదూఱనికొను హే
రాళ్లమైనపిఱుందు పల్లవరాగ పాదకరంబులున్
జాల దొడ్డగుకొప్పు నొప్పగ సర్వమోహనమూర్తితోన్

య—చూచి ఔనే యెవ్వరో యిూడే వచ్చుచున్నది.

పూ—నాచమత్కార మంతయు చూపవలయు. ఒయ్యారము గా నడచి ఏమమ్మా యశోదమ్మవు నీవేనా.

రో—అవును యీమెయే యశోద.

పూ—వినాఅబ్బాయి నొకసారి చూడ నిచ్చెదరా

య—చూడనీయక యేమమ్మా అదిగో తొట్టెలో నిద్రించుచున్నాడు.

పూ—ఏడీ యేడీ అని తొట్టె దగ్గరకు బోవును.

య—కూర్చుండవమ్మా నిద్రించుచున్నాడు లేచిన తరువాతచూతువు గాని లేవమ్మా ఇంతతొందర బడెదవేల.

పూ—పొద్దెక్కి పోవుచున్నది నే బోవలెను, [దగ్గరగాబోవును]

రో—చాలు లే చెప్పవూ ఉూడే వినబడదా యేమి నిద్రపోతూంటే లేచేదాకా ఉండలేవా పనియున్నచో మరల రమ్మ.

పూ—[కృష్ణునిచూచి తనలో ఈతడు తప్పక యశోదాతనయుడే. వేగ నాపని నెరవేర్చుకొని పోవలయును. తొట్టిదగ్గర గా నేగును.

య—[అడ్డముగానేగి గట్టిగా] నీకు చెముడా యేమి యిప్పడే యేడ్చి యేడ్చి నిద్ర పోతూంటే అప్పుడే లేపెదవు.

పూ—ఏమమ్మా! మీచోద్యాలు నీవే పిల్లలను కనిపెంచుచుంటివి గాబోలు. యీపిల్లవాని బంగార మంతా నాకంటుకుపో తుందా యేమి. యింకెవ్వరును పిల్లలను గనుటలేదా పెంచుట లేదా చూడఖాని కని వస్తే యింతఅల్లరి చేస్తున్నారు (అని తొట్టిలో చేతులు పెట్టి) గోపాలకృష్ణా గోపాలకృష్ణా రా నాయనా! నిన్ను చూడవలయునని యెంతయో సంతోషముతో నేను రాగా మీవారలు కోపించుచున్నారు లే నాయనా.

రో—నీకేమి మతి పోయినదా యేమి. ఎంతగోడాళ్లయినను నిద్రిం చుపిల్లవానిని లేపుదురా చాలు చాలు విడిచి పెట్టుము.

పూ—యేమిటమ్మా యింతరవ్వచేసెదరు. లేవదీసి (యెత్తుకొనును)

య—యెక్కడో మొండిదానివలె నున్నావు. ఆడదానికి యింతపొగరు మోతుతన ముండగూడదు.

పూ—(వినిపించుకొనకయే) నాయనా నాతండ్రి యేడవకు నాయనా నీకు ఆకలి వేయుచున్నదా బాబూ [ఒడిలో గూర్చుండ బెట్టు కొని] కొంచెము పాలు తాగు నాయనా

కం॥ నాచనుబాలొక గ్రుక్కెడు
నోచిన్నికుమార త్రావు ♦ యొయ్యన బిదపన్
నీచెలువ మెరుగ వచ్చును
నాచెలువము సఫల మగును ♦ నళినదళాక్షా.

య—ఛీ ఛీ నీకీ స్వతంత్రమేల. ఎన్ని చెప్పినను వినుపించుకొనవు మా అబ్బాయికి నీవు పాలు యివ్వనక్కరలేదు. చాలు చాలు

నడు. అని బాలుని లాగుకొన బోవును. (పూతన బాలుని విడిచి పెట్టకుండును).

రో—యింత మొండిరక్కసివేమి మర్యాదగలదానవని రానిచ్చితిమి. నీపాలు త్రాగక పోయినచో మాబాలుని కాకలి తీరకపోదు. పాలూ వద్దు పంచలూ వద్దు యీపాటి వచ్చినదారి నేగుము. పూ పాలు ద్రాగ బోవుతూంటే అల్లరి చేస్తారేమి [కృష్ణునకు చన్నిచ్చుచు] భయము లేదు లే నాయనా యేడవకు కొంచెం పాలు త్రాగి పరుండువు గాని లే (పాలు కుడుపుట నభినయించును.)

కృ—యేద్పు మాని పాలు ద్రావుట నభినయించును.

య—రోహిణీ రోహిణీ పిల్లవాని నివతలకు దీసుకొనిరమ్మి యీ మొండిరాకసి మెల్లిగా యిచ్చునట్లు లేదు లేనిచో వీధిలోని కేగి మగవారి నయినను బిలువుము. తొండ ముదిరి యూసర విల్లి యగుచున్నది.

పూ—(తనలో) ఓహో యింక నాలస్యము చేయకూడదు. ఇంక మగవార లేగుదెంచిన నల్లరి యగును. యీలోపుననే నాపని నెరవేర్చుకొనవలయును. కృష్ణా కృష్ణా త్రాగు నాయనా కడుపు నిండ పాలు త్రాగి కదలకుండ పరుండువుగాని (పాలు కుడుపుట నభినయించి) అబ్బబ్బ రక్తము గూడ పీల్చుచున్నాడేమి. అయ్యయ్యో బాధగా నున్నది. చాలు చాలు వదలిపెట్టు అయ్య బాబోయ్ చంపకుము పేగులు తోడుకొని పోవుచున్నవి.

(కృష్ణుడు నవ్వుచు వదలిపెట్టక త్రాగుట నభినయించును)

య—రోహిణీ యిది యేమేమ యిట్లు గోలపెట్టుచున్నది

పూ—రక్షింపుము రక్షింపుము. నాచన్ను వదలి పెట్టుము. నీవందరి బాలురవంటివాడవు గావు ప్రాణములు పోవుచున్నవి బుద్ధి

గడ్డి దిని వచ్చితిని. విడిచి పెట్టు మని గెంటుబోవ బాలుడు విడువక స్తనములు గట్టిగా లాగును) అయ్యోయ్యో అయ్యో సీవని యెరుంగ నయితిని బా-బో-య్ పెద్దకేక వయిచి పెద్దకొండ వలె రాక్షసరూపముతో నేల బడును. (కృష్ణుడు నవ్వుచు దానిపై బడి గంతులు వేయుచుండును.)

యశోదారోహిణులు పెద్దకేకలు వేయుచు రాక్షసి రాక్షసి యని వీధిలో గోల చేయుదురు. నందాదులు ప్రవేశింతురు.

య—[నందుని చూచి] [కృష్ణుని చూపి] నాయనా గోపాలకృష్ణా రాక్షసి రాక్షసి యిలా రా బాబూ చూచుచూ నూరకుండెద రేమి (నదుడేగి కృష్ణు దీసికొని వచ్చును.) (యశోద కృష్ణుని నెత్తుకొని) తండ్రీ యేమిరా బాబూ జడిసికొనలేదు గదా నాయనా.

నం—(రాక్షసినిచూచి) ఈరాక్షసి కుఱ్ఱవాని నావహించుటకై వచ్చినది గాబోలు. చంపుండి చంపుండి. [గొల్లవాండ్రందరును కఱ్ఱల తోను కత్తులతోనుకొట్టుదురు.]

గో—పట్టండిరా పట్టండి. చచ్చింది యీడ్చేద్దాంరండీ.

(అందరును దాని నీడ్చుచు బోవుదురు.)

య—రోహిణీ పిల్లవాడు జడసుకున్నట్లున్నాడు యేమిచేయుదునే అమ్మా (కన్నులనీరు నించును.)

రో—అక్కా వెంగుకే విచారించెదవు జడసుకుంటే రక్షరేకు గట్టి ద్దాంలే. కాసింత పేడ దిగసుడిచి పారేస్తా నుండు. (పేడపట్టుకొని పారవేయును.)

(కృష్ణుడు కొంచె మేడ్పు మానియుండును.)

(దూరముగా శకటాసురుడు ప్రవేశించి) పూతనను జంపిన మాయకు డిందున్నాడట. వాని నెట్లయిన జంపి కంసునికి సంతోషము

గలిగించెదగాక (ముందునకువచ్చి) అదిగో ఆయుయ్యాలతొట్టె యం దంతర్ధానుడనై యుండి బాలుని పరుండబెట్టినప్పుడు నల్లిని నలిపినట్లు నలిమివైచెదగాక. అని పోవును.

య—యేమే రోహిణీ యెంతలాలించినను యేడ్పు మానకున్నాడేమే.

రో—తొట్టెలో పరుండబెట్టి యూచెద నిటు తెమ్ము. (కృష్ణుని తొట్టెలో పరుండబెట్టి యూపును. యేడ్పు మానిపరుండును.)

కృ—(తనలో). శకటాసురుం డీయుయ్యాలతొట్టి నాశ్రయించి యున్నాడు నే నేడ్చుచున్నట్లు నటించి వీనిని తన్ని చంపెదగాక అని యేడ్చుచు కాళ్లతో శకటాసురుని గట్టిగా తన్నును. (శకటాసురుడు అర్చుచు మడియును).

య—అమ్మయ్యో యుం (కృష్ణునివైపు దిరిగి) రోహిణీ రోహిణీ మరల రాక్షసు డేతెంచినాడు. మరల నింకొకడు కొండవలె క్రిందబడినాడు. ఇది యేమిమాయయో గాని మనభరతము పట్టుచున్నది.

రో—యిది యంతయు రాక్షసులమాయగాని వేరొండు గాదు.

య—కృష్ణు నెత్తుకొని నానాయనకు బాలగ్రహంబులు సోకె నేమో గ్రహవైద్యులను బిలువుము.

రో—ఆలాగే పిలిపింతము. ముందు వాకలికి పోవుదము రమ్ము (ఇరువురు కృష్ణు నెత్తుకొని ముందుకు నడుతురు.)

అప్పుడు పెద్దసుడిగాలి వీచి కృష్ణు నాకసమునకు ఎత్తుకొని పోవును.

య—(ఏడ్చుచు) అయ్యో అయ్యో నాయనా నాకృష్ణా యెచ్చటకు బోవుచుంటివి. నీప్రాణమునకు యీసుడిగాలి యెచ్చటినుండి వచ్చినదిరా తండ్రీ.

క॥ సుడిగాలి వచ్చి నిన్నుఁ

సుడిగొని కొనిబోవ మింట • సుడిసుడి గొనుచున్

ఔష గడరెడినాయుద్దుల
కొడుకా యెట్లుంటి వీవు ♦ ఘోరం బకటా॥

నాముద్దులతండ్రి నేనెన్నిజన్మము లెత్తి, యైన నీవంటికుమారుని గాంచ గలనా కటకటా నావంటినిర్భాగ్యురాలు ఈభూమిని లేదు. నాయ నా యెచ్చట బడెదవ్రా గదా! తండ్రి రమ్ము.

రో—అక్కా యేల విచారించెదవు మనకృష్ణున కేమియు భయము లేదు. యిది నిశ్చయ మయినను సీగాలి గాను రాక్షస మాయ. అదిగో చూడుము రాక్షసుడు ఎత్తుకొని పోవుచుండ వానికంఠ మును బిగియ బట్టి మనబాలకృష్ణుడు క్రింద కీడ్చుచున్నాడు.

య—ఏడీ! నాముద్దుకృష్ణు డేడీ.

రో—అదుగో చూడుము రాక్షసుడు క్రిందను మనకృష్ణుడు పైనను గూలు చున్నారు. (రాక్షసుడును కృష్ణుడును క్రింద బడుదురు.) రాక్ష సుడు కొండవలె బడి చచ్చినాడు. అదుగో గోపాలకృష్ణుడు గంతు లు వైచుచున్నాడు. అక్కా! మనకు దైవసహాయము గలదు.

కం॥ రక్షణము లేక సాధుడు
రక్షితుఁ డగు సమతఁ జేసి ♦ రాయిడులందున్
రక్షణములు వెయి గలిగిన
శిక్షితు డగు ఖలుడు పాప ♦ చిత్తుం డగుటన్॥

శ్రీకృష్ణు నెత్తికొని వచ్చి యశోద కిచ్చును.

య—నా వరాలతండ్రి నాముద్దులమూటా నాకుమారా మేము పూర్వ భవంబున నెంతపుణ్యము చేసి యుంటిమో గాని లేకున్న నాబా లకృష్ణుడు నాకుదక్కునా. రోహిణీ మనపూర్వపుణ్యఫలం బెంతని వర్ణింతును.

మ॥ గతజన్మంబుల నెందు బుట్టితిమొ యా ♦ గశ్రేణు లేమేమి చే
సితిమో యెవ్వరి కేమి పెట్టితిమొ యే ♦ చింతారతిం బ్రొద్దు పు

చ్చితిమో సత్యము లేమి పల్కితిమొ లేమొ ♦ సిద్ధప్రదేశంబు దొ్రి
క్కితిమో యిప్పుడు చూడఁ గంటిమిచటన్ ♦ గృష్ణార్భకు న్నిర్భయుల్
ఇంక మనమిటనుండి బోవుటయు రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

రంగము గ్రామములోని రచ్చసావడి.

నందుడు కొందఱుగొల్లలు ప్రవేశింతురు.

నం—మిత్రులారా! మనగ్రామంబునకు కొన్నిదినంబులనుండి రాక్షసమాయలు గలుగుచున్నవి.

1 గొ—నిజము నిజము రాక్షసమాయలతో మన మెన్నాళ్లు బాధపడగలము యేదియోదారి చూచుకొనవలసినదే.

2 గొ—అయ్యలారా! మనపల్లెయందు దపశకునములు చాల గనపడుచున్నవి. యింక నిచ్చట నెట్లుండవచ్చును. చూచితిరిగదా.

ఉ॥ ఇక్కడ నుందురే మనుజు ♦ లీమనకృష్ణున కెగ్గుసేయగా
రక్కసురాలు చన్గొనగ ♦ రాలపయి న్సుడిగాలి వీచెఁ బై
క్రిక్కిఱి యుందరు ల్వడియెఁ ♦ గేశవునత్కృప దప్పెఁ జాలు నే
డెక్కడికైనఁ బోవలయు ♦ నింకిట గోపకులార వింటిరే॥

నం—మిత్రులారా! నిశ్చయముగా మన మిచ్చటనుండి పోవలయును రాక్షసులు మనయందు కక్ష వహించి యున్నారు. ఏదియైన మంచి నెలవు కని యెఱింగింపుడు.

1 గొ—నాకు తోచినవిధం బెఱింగించెద వినుడు. మన కన్నిసదుపాయములకు ననుకూలప్రదేశము కావలయును గావున వినుడు.

కం॥ కసవు గల దిరవు ♦ పసులకు
లసదద్రినదీమహీజ ♦ లతికావళిఁ బెం
పెసఁగును గాపురమునకును
బొసఁగును బృందావనంబు ♦ బోదఁ డచ్చటికిన్॥

2 గొ—ముఖ్యముగా మనగోగణంబునకు మేత గావలయును గావున బృందావనమే మంచి దని తోచుచున్నది.

3 గొ—మనపల్లెకంటె బృందావనమే హాయిగా నుండును. మనమును పశువులును సుఖముగా బ్రతుకవచ్చును.

నం—సంతోషము మిత్రుడా మంచిస్థలనిర్దేశము జేసితివి. అందరకును నీయుద్దేశ మిష్టమేనా.

4 గొ—ఇష్టపడక యీరాక్షసులతో నెవడు వేగగలడు.

1 గొ—కొంతమంది బయలుదేరినచో నందరును తమంతటతామే బయలుదేరుదురు.

(అందరును సంతోషముతో) బృందావనమున కరుగుటకు మాకందరకును సమ్మతమే.

2 గొ—అయినచో నెప్పుడు బయలుదేరుటకు నిశ్చయించితిరి.

1 గొ—మంచిముహూర్తము చూచి గాని బయలుదేర గూడదు.

నం—గొల్లలారా! మనకు చిరకాలమునుండి పురోహితు లయినట్టియు సమస్తశాస్త్రములను జదివినట్టియు జ్యోస్యు డని పేరుగాంచిన గర్గమహాముని నడిగి మన కుపయుక్తమగునట్లుగా ప్రయాణము హూర్తము నిర్ణయించి మీకందరకును దెలిపెదను. గావున మీరు ప్రయాణసన్నాహములతో నుండుడు.

గొల్లలు—యింతకన్న మనకు గావలసిన దేమి. త్వరలో జాగు సేయక ముహూర్తము బెట్టించవలయును. ఇంకపోదమురండు.

(అందరు నిష్క్రమింతురు.)

రంగము యశోదగృహము.

గొల్లపడుచులు ప్రవేశించుచున్నారు.

గొల్లది—బోటులారా! బాలకృష్ణునియల్లరి పనులు చూచిన కోపమును సంతోషమును గూడ గలుగును. ఈతనిచర్య లన్నియు మహాద్భుతములు. మొన్న పిల్లలతో నాడుచు:

సీ॥ గోవల్లభుఁడ నేను ♦ గోవులు మీరని
వడి రంకె వైచుచు ♦ వంగియాడు
రాజు నే భటులు మీ ♦ రలు రండు రండని
ప్రాభవంబునఁ జెక్కు ♦ పనులు పనుచు
నే తస్కరుండ మీ ♦ రింటివార ని నిద్ర
పుచ్చి సొమ్ములు గొని ♦ పోయి డాగు
నే సూత్రధారి మీ ♦ రెంతయు బహురూపు
లని చెలంగుచు నాట ♦ లాడఁ బెట్టు
గీ॥ మూల లురుకును డాగిలి ♦ మూతలాడు
నుయ్యాలల నూగు జేబంతు ♦ లొనర వైచు
జారచోరుల జాడలఁ జాల ♦ నిగుడు
శౌరి బాలురతో నాడు ♦ సమయమందు॥

2 గో—అవునమ్మా అతనికృత్యము లమానుషములు.

3 గో—ఇంతదుండగీ డీలోకమున లేదు.

4 గో—మీరందరు వచ్చినపనులు మరచి కృష్ణునితో నైక్య మగుచున్నారు. ఎన్నాళ్లీదుండగపుపనులు సహించి యుండగలము మీ కిష్టము లేకపోయిన మానుకొందు నేను మాత్రము సహించి యుండలేను ఆయశోదమ్మతో నొకసారి చెప్పి కొట్టించిన గాని భయ ముండదు.

1 గో—వానిక్రీడల దెలిపితిని గాని మాకుమాత్రము కష్టముగా లేదా (ముందుకు జూచి) అదిగో యశోద యీవంకకే వచ్చుచున్నది. చెప్పుదము రండు (కొంచెము ముందున కేగుదురు.)

యశోద ప్రవేశించును.

య—(వారలను చూచి) పడుచులారా! మరల నేమి వచ్చినది. యింత మందియు నొక్కమారే దిగినారు.

4 గో—తల్లీ యశోదమ్మా మే మిచ్చట కాపురము చేయడము మీా కిష్టము లేదా యేమి. యెన్నాళ్లీబాధలు పడగలము.

యు—ఏమిబాధలు పడుచున్నారే మరల నేరాక్షసు డయిన వచ్చినాడా యేమి?

3 గో—రాక్షసులు రానక్కర లేదమ్మా మీాకృష్ణునిముందు నిలువజా లకున్నాము. ఇన్నికొంటెపను లెప్పుడు నేర్చినాడమ్మా.

2 గో—పుట్టుకతోడనే నేర్చినాడు.

1 గో—ఇక నెక్కడి కయినను బోవుటయే మంచిది.

య—పడుచులారా! మీా కంతకష్ట మేమి వచ్చినది.

4 గో—కష్ట మేమి యని మెల్లిగా నడుగుచున్నావా. నీకుమారుని ముందు నిలువ లేకుండా నున్నాము.

3 గో—మేము చెప్పుమాట లబద్ధము లని దలంపకుము. వినుము. నిన్న మాపిల్లలు అన్నములో పాలు పొయ్యమని యేడ్చుచుండ నే లే కుండ చూచి యెక్కడనుంచి వచ్చినాడో గాని.

కం॥ పడతీ నీబిడ్డఁడు మా
కడవలలో నున్నమంచి కాగినపాలా
పడుచులకు పోసి చిక్కిన
కడవలఁ బో నడచె నాజ్ఞ కలదో లేదో॥

ఈలాగైన నెంతకాలము బ్రతుకగలము.

2 గో—యశోదమ్మా నిన్న లేగలతో నీకుమారు డాడుచుండ

కం॥ బాలురకు పాలు లేవని
బాలింతలు మొఱలు పెట్ట పకపక నగి నీ
బాలు డాలముఁ జేయుచు
నాలకు గ్రేపులవిడిచె నంభోజాక్షీ॥

4 గో—తల్లీ వినుము మీబాలకృష్ణుఁడు మాయింటికి వచ్చి మేము లేకుండ జూచి కడవలలోనిపాలు త్రాగి మేము వచ్చుట యెఱింగి యొకమూల దాగి మేము వెతుకుచుండ పిల్ల లాదెస జూపినంత వారిని గొట్టుచు పరిగెత్తి పోయినాఁడమ్మా. చూపులకు పిల్లవాఁడు గాని చేష్టలు చూడుము మాయింట

కం॥ వెన్న దినఁగ బోడఁగని మా
చిన్నది యడ్డంబువచ్చి ౹ పిరిదికి దివియన్
జన్నొడిసి పట్టి జీరెను
జిన్నికుమారుండె యతఁడు ౹ శీతాంశుముఖీ॥

1 గో—అమ్మా యశోదా!

మత్తకోకిల.

పుట్టి పుట్టఁడు నేఁడు దొంగిలఁ ౹ బోయి మాయిలు సొచ్చి తా
నుట్టికిందను రోలు పీటలు ౹ నొక్కపో విశి యెక్కి చే
పెట్టఁ జాలక కుండక్రిందను ౹ పెద్దతూటొనరించి మీ
పట్టి మీగడ పాలు చేరలఁ ౹ బట్టి త్రావె ౹ తలోదరీ॥

ఇట్టి పనులు నీకుమారునకు తగు నటమ్మా

య—పడుచులారా! మీరంద రిట్లాలోచించుకొని వచ్చిన ట్లున్నది. గాని నాబాలకృష్ణు డెన్నఁడును యట్టిపను లొనరించువాఁడు గాఁడు మాయింట వెన్న లేదా పెరుగు లేదా పాలు లేవా.

గో—మేము చెప్పిన నీ కాశ్చర్యము గానే యుండును. ఎవ్వరి నయిన నడిగి తెలిసికొనుము. నిన్న

ఆ॥ వె॥ నమ్మి నిదురవోవ ౹ నాపట్టిచుంచు మా
లేఁగకోడెఁ ద్రాడు ౹ ద్రెంచిగట్టి
వీధులందుఁ ద్రోలెఁ వెలఁది నీకొమరుండు
రాచబిడ్డఁ డయిన ౹ రవ్వ మేలె॥

ఇట్టిదుడుకుపనులు సేయుచుండ నెట్లోర్వఁగల మమ్మా యేమయినా యన్నచో నీకు కోపము వచ్చును.

3గో—నిన్న నీకుమారుడు సరోజినియింటికి కరిగి ఆమె లేకుండ చూచి కడవలో వెన్న యంతయుఁదిని కొంచెము దాని కోడలిమూతికి రాసి దానియత్తతో నీకోడలు వెన్న యంతయు దిన్న దని చెప్పి కొట్టించినాడు. ఇంతటికొంటెపనులు చేయుచుండ నేమి యు నెరుగని వెఱ్ఱికృష్ణు డని వచించెదవు. అదిగాక నీవింత వినుము.

కం॥ చేబంతి తప్పి పడెనని
ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుకన్
మాబిడ్డ జలక మాడఁగ
నీబిడ్డఁడు వలువ దెచ్చె నెలతుక తగునే.

య—(నవ్వుచు) బాల్యచేష్టల కింత కినియుదు రటే.

2గో—అవునమ్మా నీకు నవ్వులాటక్రిందనే యుండును. వినుము.

కం॥ తెఱవ యొకతె నిదురింపగ
నెరి గట్టినవలువ నీడ్చి నే డొక తేలుం
గరిపించె నీ కుమారుఁడు
వెరచుచు నది పరువ నగుట విహితమె సాధ్వీ.

1గో—ఎన్నని చెప్పుదుము యింతచిన్నవాని కిట్టిగుణము లెట్లు వచ్చి నవ్వొ తెలియదు. ఏపని జూచినను ఆశ్చర్యముగానే యుండును చెప్పుటకు గూడ సిగ్గగుచున్నది.

గీ॥ తరుణి యొకతె పెరుగుఁ దరుచుచు దుది వంగి
వెన్న దీయ నొఱగి వెనుక గదిసి
మగువ నీసుతుండు మగపోడుములు సేయ
సాగినాడు తగదె చక్కఁజేయ.

ఇవన్నియు నబద్ధములే యందువు గాబోలు.

1గో—అమ్మా నీకుమారు డెప్పుడు వచ్చునో యని భయపడుచునే యుందుము.

కం॥ వారింటఁ జొచ్చి కడవల
తోరం బగునెయ్యి ద్రావి తుది నాకడవల్
వీరింట నీ సుతుం డిడ
వారికి వీరికి నిదొడ్డవా దయ్యె సతీ.

ఇట్టిపనులు చెప్పదలచుకొన్న వేలకువేలు గలవు.

గో—అమ్మా యశోదమ్మా

కం॥ కడు లచ్చి గలిగె నేనియుఁ
గుడుతురు గట్టుదురు గాక కొడుకుల నగుచున్
బడుగులవాడలపైఁ బడ
విడతురొకో కాంత లెందు విమలేందుముఖీ.

తల్లీ యింక నిచ్చట నున్నచో మాయిండ్లకడ పాలు పెరుగులు నిలువ నీయఁడు. మమ్ములఁ దిన్నగా బ్రతుకనీయఁడు. ఒకనాడా రెండు రోజులా యీబాధలు పడియుండుట యెంతకాల మోర్వగలము. ఇక నీగ్రామంబును వీడి యెట్లకైన నేగి జీవనంబుగడపెదము. యింతేగాని యిక్క డుండలేము తల్లీ.

య—ఏమే మీరందరు నిట్లు చెప్పెదరు. మాబాలకృష్ణు డెప్పుడును యింటికడ నయిన నల్లరి చేసి యెరుగఁడు. ఒక్కమారయినను నన్ను విడచి యిట్టటు బోడు. బొరుగిండ్ల కేగుట యెప్పుడును లేదు. యింతసుకుమారాకారుని మాకృష్ణుని యింతగా రవ్వ పెట్టుట మీకు న్యాయమా.

ఆ॥వె॥ అన్య మెఱుగఁడు తనయుంత నాడుచుండు
మంచివాఁ డితఁ డెగ్గులు మానరమ్మ

రామలార త్రిలోకాభి క్ష రామలార
తల్లులార గుణవతీమ క్ష తల్లులార.

(అప్పు డొకగొల్లపడుచు తొందరగా ప్రవేశించి) నేనెన్నిమారులు చెప్పినను మావాడిల్లు విడిచి పెట్టడని యే చెప్పుచుందువు గదా చూడు మిపుడే మా పెరుగంతయు ద్రాగి కడవలు బ్రద్దలు గొట్టగా అనేకతంటాలు పడి దెబ్బలు దిని గిల్లులచే నొచ్చి నీకు చూపించవలయు నని మీ కృష్ణుని బట్టుకొని గదిలో బెట్టి తాళము వేసి వచ్చితిని రమ్మా చూతువుగాని ఇప్పుడు గాని నీకు తెలియదు.

య—(పెద్దగా నవ్వుచు) చూచితిరా పడుచులార యీమె జెప్పువాక్యముల నెవ్వరు విశ్వసింతురు యిప్పుడే గదా అన్నము బెట్టి రామునితో గలసి యాడుకొమ్మని చెప్పి వచ్చితిని యింకను వీధిలోని కయిన బోలేదు యింతలోనే యిన్నిమాయమాటలు చెప్పుచున్నది.

5 గో.—చాలు లేవమ్మా నామాట లబద్ధమందువా రమ్ము చూపెదను

య—చూప నక్కర లేదు. నీమాట లబద్ధ మని నేను వేరే చెప్పవలయునా! యింటిలో నాడుకొనుచుండగనే యిన్ని గల్పించితివి.

5 గో—(తనలో) యీమె యిట్లు వచించుచున్నది (ప్రకాశము) సరే నామాట లన్నియు బూటకములో నిజమో తెలియగలదు ఆడుకొనుచున్న చో నొక్కసారి మీబాలు నిటకు బిలువుము.

య—సరే పిలిచెదను కృష్ణా గోపాలకృష్ణా నాముద్దులకుఱ్ఱా ఒక్కసారి యిటు రమ్మా.

కృ—(గంతులు వేయుచు) ఎందుకే అమ్మా అన్నయ్యతో ఆడుకొంటూంటే పిలుస్తున్నావు (వచ్చును.)

గొల్ల లందరు ఆశ్చర్యముతో చూతురు,

య—పడుచులారా మీాయనుమానము తీరినదా.

ర గొ—కృష్ణా యిప్పుడు మాయింటివద్ద అల్లరి చేయుచుంటివి గాదా యిక్కడ కప్పుడే యెట్లు వచ్చితివి.

కృ—నేనా నేనా చాల్లే ఎవరినో చూచి నన్ననుకొన్నావు గాబోలు యీాపర్యాయ మను యీాకఱ్ఱ దీసుక పెడతా.

(అందరును నవ్వుదురు)

ర గొ—(తక్కినవారితో) నిజముగా నే నిప్పుడు కృష్ణుని గదిలో పెట్టి తాళము వయిచి వచ్చితిని మరల నిక్కడి కెట్లు వచ్చినాడో తెలియదు యి దంతయు మాయ గా గనబడుచున్నది.

తక్కినగొల్లలు అయినచో మన మందర మట కేగి చూతము రండు. ఎప్పుడును కృష్ణుని చర్య లిట్లే యుండును. (అందరును నిష్క్రమింతురు.)

య—కృష్ణా నీ వీగొల్లవారి యిండ్ల కరిగి యల్లరి చేయుచుంటి వని ప్రతిరోజును గోల పెట్టుచున్నారు నాతో చెప్పకుండ ఎందుల కరుగుచుంటివి

కృ—నే నెప్పుడు వెళ్లాను నామీాద కోపముచే వార లందురు.

(తెరలో)

కృష్ణా కృష్ణా ఆడుకొందము రమ్ము

కృ—అదిగో అన్నయ్యా వాళ్లు సిలుస్తున్నారు నే నాడుకోడానికి వెళ్లి పోతా.

య—నాయనా ఒక్కము ద్దిచ్చి మరీ పొమ్ము ఆటలలో జాగ్రత్త సుమాా.

కృష్ణుడు గంతులు వేయుచు లోనికిబోవును.

య—(తనలో) మాకృష్ణునిచరిత్ర మెప్పుడు చూచినను నాశ్చర్యము గానే యుండును ఎప్పుడు ను ఇంటియం దున్నట్లే యుండును.

తృతీయాంకము.

యెన్నడును వీధి లోనికి పోవుజాడ గన్పట్టదు. ఈగొల్లవడుచుల వాక్యము లబద్ధము లని యెంచిన వారట్టిమాటలు పలుకువారు కారు. యీయాశ్చర్య మేమియు నెఱుంగ రాకున్నది.

అంత బలభద్రుండును గోపబాలురును కృష్ణు డేడ్చుచుండ నీడ్చికొని వత్తురు.

బ—అమ్మా అమ్మా చూశావు మనకృష్ణు డేలాంటిపనులు చేస్తున్నాడో

య—ఏమితప్పుపని చేస్తున్నాడురా నాయనా.

కృ—యేమీ లేదే యిందాక మీగడ వీళ్ళకి పెట్టాను గానని నన్నీడ్చుకొస్తున్నారే వదలరేం నేనాడుకోవాలి ఊ ఊ.

గో—యేం జేస్తున్నాడో నే జెప్పనా.

కృ—(అపవారించి) చెప్పారంటే ఆనక నీపని చెప్తా (చేయిచూపును.)

బ—ఆడుకుంటూ ఆడుకుంటూ మన్ను దీసుకు తింటున్నాడే.

య—ఆ మన్నే తినడం.

కృ—అన్నయ్య అబద్ధం ఆడుతున్నాడు. నే మన్నెందుకు తింటానే.

బ—నే నబద్ధం ఆడానంటే అమ్మ నమ్ముతుందా.

య—కృష్ణా నీపను లెప్పుడు చూచినా యిలాగే యున్నవి. ఎప్పటికప్పుడేవో కల్లబొల్లిమాట లాడి తప్పించుకొందువు. మీఅన్నయ్య నీమీద అబద్ధము చెప్పుటకు కారణ మేమి.

కృ—యిందాక అప్పచ్చి పెట్టాను కానని కోపము.

య—యెంతగడుసునాడవు రా నాయనా నీవలె అన్నయ్యెన్నడూ అబద్ధమాడువాడు గాడు. నీచైదము లెప్పుడూ యింతే నిన్ను నమ్మగూడదు. అంత తినాలని వుంటే యేమయినా పెట్టమని అడగరాదూ. యీలాంటి పనులు నీవుచేస్తూ పైగా అన్నయ్య మీద గూడా దొర్లిస్తూన్నావు. నీకు బొత్తిగా భయము లేదు.

కం॥ మన్నేటికి భక్షించెదు
మన్నియమము లేల నీవు । మన్నింపవు నీ
యన్నయు సఖులును జెప్పెద
రన్నా మన్నేల మఱి ప । దార్థము లేదే.

కృ—అమ్మా నేను తిన లేదని యెన్ని చెప్పినను నమ్మవు గదా. వాళ్లు నామీద కోపముచే నేదియో యొకటి చెప్పుతూంటే అదే నిజమని చెప్పి నన్ను దండించుచుంటివు. మన్ను తింటే నోరు మట్టివాసన వేస్తుందా వెయ్యదా చెప్పు.

య—మట్టివాసన పోవునా.

గో—వాసన పోయిం దేమో చప్పరించి చప్పరించి మింగేశాడు.

కృ—అయితే చూడు (అని నోరుజూపును.)

శా॥ అమ్మా మన్ను దినంగ నే శిశువునో । యాకొంటినో వెఱ్ఱినో
నమ్మం జూడకు వీరిమాటలు మది । న్ననీవు గొట్టంగ వీ
రి మ్మార్గంబు ఘటించి చెప్పెదరు కా । దేనిం మదీయాస్యగం
ధ మ్మాఘ్రాణము సేసి నావచనము । ల్దప్పైన దండింపవే.

య—(చూచి తనలో) ఆహా యేమిది వీనినోటియందు సమస్తభువనములును గోచరం బగుచున్నవి. అరుగో బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అరుగో సప్తమహాఋషులు అవిగో పర్వతములు ఇవిగో నదులు ఇవి యవి యన నేల సమస్తప్రపంచంబులు నీ నోటియందే యిమిడి యున్నవి. నమ్మజాల నమ్మజాల.

కలయో వైష్ణవమాయయో యితరసం । కల్పార్థమో సత్యమో
తలవ న్నేరక యున్నదాననో యశో । దాదేవిగానో పర
స్థలమో బాలకుఁ డెంత యీతనిముఖ । స్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువొ మహా । శ్చర్యంబు చింతిపగన్

ఆహా యీతడు నాబాలు డని యెంచుచుంటిని గాని యితడు నిజముగా బాలుడు గాడు బాలుడైన నెట్టేత్రనినోట విశ్వంబంతయు నిండి యుండును. నిశ్చయముగా నితడు మహావిష్ణువుగాని వేరొండు గాడు నాపూర్వపుణ్యలేశంబున నాకు దర్శన మిచ్చెను.

గీ॥ ఏమహాత్మ్యవలన ని నీవిశ్వరూపంబు
గానఁబడిన బుద్ధి ని కంపమొందె
నామహాత్మ్మ విష్ణు ని నఖిలలోకాధారు
నార్తు లెల్ల బాయ ని నాశ్రయింతు.

సీ॥ శంపాలతికతోడి ని జలదంబుకైవడి
మెరుగుటొల్లియతోడి ని మేనివాని
కమనీయమృదులాన్న ని కబళవేత్రవిషాణ
వేణుచిహ్నంబుల ని వెలయువాని
గుంజావినిర్మిత ని కుండలంబులవాని
శిఖిపింఛవేష్టిత ని శిరమువాని
వనపుష్పమాలికా ని వ్రాత గంధమువాని
నళినకోమలచర ని ణములవానిఁ

గీ॥ గరుణ గడలుకొనిన ని గడ కంటివాని గో
పాలబాలుభంగిఁ ని బరగువాని
నగుమొగంబువాని ని నను గన్నతండ్రిని
నిను భజింతు మ్రొక్కి ని నీరజాక్ష

దేవాధిదేవా, లోకరక్షకా, నీచైదము లెరుంగ శక్యము లగునా.

ఆ॥వె॥ ఆత్మవలన గలిగి ని యమరు దేహాదులు
ఆత్మకంటె వేరు ని లవి యటంచు
దలఁచువాఁడు మూఢ ని తముఁ డుగావున నీశ
విశ్వమెల్ల నీవ ని వేరు లేదు.

కృ—(తనలో) ఓహో యీమె నావిశ్వరూపప్రదర్శనముచే ప్రపంచ మునే మఱచి యున్నది. ఇట్లుంచిన ముందుగలుగఁబోవు కృత్యముల కాటంకము గల్గును. కావున నీమెను వైష్ణవమాయా మోహితురాలిం జేసి యెప్పటియట్ల యుంచెదను. అని వైష్ణవ మాయను ప్రయోగించును.

య—నాయనా కృష్ణా యేడవకుము. నీవు మన్ను దినలేదు లే.

రా—కృష్ణా ఆడుకోవటానికి వస్తావా.

కృ—నేను రాను పోంకు వస్తే యీలాంటివే చెప్తూ ఉంటారు అమ్మతో

రా—గోపాలా మనము పోదం రా తరువాత వాడే వస్తాడు.

ఇరువురు పోదురు.

య—కృష్ణు నెత్తికొని నాయనా నీవు వెళ్ల వద్దు లే ప్రాయి. చల్ల చేసి నీకు వెన్న పెట్టెద. నిచట కూర్చుండుము. (కూర్చుండ జేసి చల్ల దరచుట నభినయించును.) వెనుకకు జూచి కృష్ణా జాగ్రత్తగా కూర్చుని యుండుము. పాలు పొంగి పోవుచున్నవి. దింపి వచ్చెదను. (అనివడిగా పోవును.)

కృ—(రాయి దీసికొని కుండను బ్రద్దలు గొట్టి) ఇదే సమయము మా అమ్మవచ్చులోపల నీవెన్న దినియెదగాక (తినుట నభినయించును.) అదిగో మాఅమ్మ వచ్చుచున్నది. యిదిచూచినచో గొట్టును. (యింకొకదెసకు పోవును.)

య—(ప్రవేశించి) బ్రద్ద లయినకడవలను జూచి యీకడవలను బ్రద్దలు గొట్టి వెన్న దిని నే వచ్చి యేమందునోయని పారిపోయినాడు. గాబోలు యెట కేగెనో వెతకెద గాక (యింకొక తట్టునకు బోవును.

కృ—(ప్రవేశించి) అదిగో ఆవుట్టిమీద వెన్న నెట్లయిన నందుకొనవల యును. (ఒకరోలు లక్కడకుదోసికొని వచ్చి దానిపై నెక్కి వెన్న తీయుచుండును.

య—(ప్రవేశించి చూచి) ఉట్టిమీద వెన్న నందుకొనుచున్నాడు. ఏమి వీనిసాహసము ఎప్పుడును తనకు దగనిపనినే చేయుచుండును.

సీ॥ బాలుఁ డీతం డని ౕ భావింతు నంటినా
యే పెద్దలును నేర ౕ రీక్రమంబు
వెర వెఱుంగుటకు నై ౕ వెరపింతు నందునా
కలిగి లే కొక్కఁడు ౕ గాని లేఁడు
వెరపుగో నాబుద్ధి ౕ వినిపింతు నందునా
తాను దానై బుద్ధి ౕ దప్పకుండు
నొం డెఱుంగక యింట ౕ నుండెడి నందునా
చొచ్చి చూడని దొక ౕ చోటులేదు.

ఆ॥ వె॥ తన్ను నెవ్వ రైన ౕ దలపోయఁ బారెడు
నోజ లేదు భీతి ౕ యొక టెఱుంగఁ
డెలమి నూరకుండ ౕ డెక సక్కెముల నాడు
పట్టి శాస్త్రి చేయు ౕ భంగి యెట్లు॥

(ఆలోచించుటనభినయించి) యెల్లప్పుడునిట్లే ముద్దుగా నూరకున్న చో అం తకంతకు ననేకతుంటరితనములు గలుగును. పిల్లవాండ్రను కొం చెము భయము గలుగునట్లు రెండు వాయించుట మంచిది. దాని వలన ముందు బాగు పడుదురు. అని కఱ్ఱ తాటించుచు యేమిరా నీ కెన్నిమారులు చెప్పినను భయము లేదా ఆగు మాగుము నీకు దెబ్బలతో గాని బుద్ధి రాదు. (దగ్గర కరుగును.)

కృ—(చూచి)అదిగో కొట్టుటకు వచ్చుచున్నది. (రోలురికి పారిపోవును.)

య—(వెంట బరువెత్తును. ఇరువురు లోనికి పోదురు.)

కృ—(మరల ప్రవేశించి)మాయమ్మ యిక్కడెక్కడా లేదు గదా. (యిటునటు జూచి) నాఁకరుగు పట్టుకో లేక పోయింది.

తెరలో.

ఆగు మాగుము యెచ్చటకు పరుగెత్తెదవు.

కృ—అదిగో యిలాగే వస్తాది.యీస్తంభముచాటున డాగెద(దాగును)

య—వచ్చి వీడీ యిప్పుడిచట నున్నాడే ఇంతలో నెచ్చటకు పోయినావు రా. నీకు బొత్తిగా భయము లేదు. (వెదకుటనభినయించును.)

కృ—ఇదిగో యీపక్కకే వస్తుంది చూస్తుందేమో.

య—(స్తంభము దగ్గర కేగి యిటు నటు చూచును.)ఔరా యింకెక్కడికి పోగలవు. (పట్టుకొన బోవును.)

కృ—స్తంభము చుట్టు నొకరి వెనుక నొకరు తిరుగుదురు.

య—కృష్ణుని పట్టుకొని అమ్మయ్యా యెంతతంటాలు పెట్టినావు రా. ఏమి చేసెదనో చూడు (లాగును)

కృ—(యీడిగిలబడుచు) అమ్మా అమ్మా పదిలి పెట్టు. యింకెప్పుడూ యీలాటిపని చేయనే. (కన్నులు నులుముకొనుచు) ఊఁ ఊఁ నేరాను. యీవాళ కూరుకో యింకెప్పుడూ చెయ్యను. (ఏడ్చును)

య— (తనలో) యీకుమారుని గొట్టుటకు చేతు లెట్లు వచ్చును.(ప్రకాశము)నీకల్లబొల్లియేడ్పుల కేమిలే. యిదిగో యిటుచూడు.

కం॥ వీరెవ్వరు శ్రీకృష్ణులు
గారా యెన్నడును వెన్నకై గాన రంట కదా
చోరత్వంబించుక యును
నేర రంట ధరిత్రి నిట్టి కనియతులుగలరే॥

అమ్మా నీవు చులకనగా దొరికితివా ఇటువంటియల్లరిపను లన్నియు జేయుచు నేనేమి పాప మెరుగనని చెప్పుచుందువా అబ్బా నీపని తెరుగ ననుకుంటివా

కం॥ ఎక్కడ నయినను దిరిగెడ
  వ్రక్కమొదం గుణము గలిగి కె యుండవు నియమం
  బెక్కడిది నీకు మరచినఁ
  జిక్కగ బోయెదవు పెక్కు కె జాడలఁ బుత్రా॥

నిన్నూరకే విడచి పెట్టిన మంచివాడవు గావు

కృ—అమ్మా ఊ. ఊ యీమాటు చేస్తే పట్టుకుని కొట్టవే యింకె ప్పుడూ అల్లరి చెయ్యనే. వదిలి పెట్టవే అన్నయ్యతో ఆడుకుంటా

య—అబ్బా నిన్ను మాత్రము వదిలిపెట్టను వదిలిపెట్టా నంటే చేసే వన్నీ అల్లరిపనులే నిన్ను నమ్మగూడదు యీరోటికి గట్టి వైచె దను నే వెన్నగాచి వచ్చినదాక నుండుము అప్పుడు విప్పెదను.

కృ—నాకొద్దే అమ్మా నాకొద్దే అనియేడ్చును.

య—(రోటను గట్టి పోవును)

కృ—(రో లీడ్చుకొనుచు రెండుమద్దివృక్షములమధ్యను ప్రవేశించును. కృష్ణుడు ముందునకుబోగా రోలడ్డము పడును ఊంకించి ముందు నకు లాగును వృక్షములు రెండు ను నేల గూలును లోపల నుండి యిరువురు సిద్ధులు వచ్చి కృష్ణునకు నమస్కరించి) దేవా నీవు శ్రీమన్నారాయణుండవు గాని బాలుండవు గావు.

సీ॥ ఎల్లభూతంబుల ♦ కింద్రియాహంకృతి
  ప్రాణంబులకు నధి ♦ పతివి నీవ
 ప్రకృతి యు ప్రకృతిసం ♦ భవమహత్తు నకును
  వెలయునన్నిటికిని ♦ విభుఁడ వీవ
 ప్రాకృతగుణవికా ♦ రములఁ బొందక పూర్వ
  సిద్ధుఁడ వగునిన్నుఁ ♦ జింత సేయ
 గుణహితుం డోపునే ♦ గుణహీన నీయందు
  కళగుణంబుల నీవ ♦ కప్పఁబడుదు

గీ॥ మొదల నెవ్వనియవతార • ములు శరీరు
లందు సరిదొడ్డు లేనివీ • ర్యములఁ దనువు
లడర జన్మించి వారల • యందు జిక్క
వట్టి పరమేశ ప్రొక్కెద • నయ్య నీకు.

మాధవా నీమహిమ లెరుంగ నెవ్వరితరము. సమస్తభువనములు రక్షింప జనించితివి కాదే మున్ను మేము నారదునిశాపవశమున నీమద్దివృక్షములుగా జనించితిమి. మేము కుబేరతనయులమగు నలకూబర మణిగ్రీవులము.

కృ—(ఆదరముతో) నలకూబరమణిగ్రీవులారా!

కం॥ కారుణ్యమానసుం డగు
నారదువచనమునఁ జేసి • నను బొడగనుటన్
మీరు ప్రబుద్ధుల రైతిరి
చేరె న్నామీఁదఁ దలపుఁ • సిద్ధము మీకున్

న॥ మ॥ దేవా! ఆపన్నరక్షకా.

ఉ॥ శ్రీరమణీమణీహృదయ • నీమవిలోల భవత్కథామృతా
లోలన భక్తపాల సుర • లోకవిరోధిమదాంతశీల గో
పాల సువర్ణచేల ముని • పంక్తిమనోవనజాతలోల. త్రా
పాల సురారికాల నిజ • భక్తవిచారణశీల మాధవా॥

మాకు సెలవుదయ చేయుము.

కృ—మీ నెలవులకు మీ రేగుఁడు. (వా రిరువురును పోదురు.)

కొందరు గొల్లలు ప్రవేశించుచున్నారు.

1 గొ—గుండెలు చేతితో బట్టుకుని అయ్యా బాబోయి నొక్కడో పిడుగడిం దరోయ్ (యింకొకనిమీఁద బడును.)

2 గొ—అవునోయి కొండిలిగి బడిపోయినట్టే అయిందిరో ఒ కే మనమీద బడదు గదా. (ఇంకొకనిని కౌగిలించును.)

3 గొ—ఒరేయ్ నాకు వణుకొత్తూంది. (పైకి చూచి) పడుతూంది పడుతూందిర్రో బాబో (వాండ్రమీద పడును) (ఒకనిమీద నొకడు పడుచు లేచుచు గోల చేయుచు గంతులు వేయుదురు.)

4 గొ—ఒరే యేంది రా అల్లరిపిడుగయితే వర్సం లేకుండా యేలా పడుద్దిరా

1 గొ—యింకా నాగుండె లెలా కొట్టుకుంటున్నాయో సూడు. (యింకొకనికిజూపును.) చూడవేం రా చూడు.

4 గొ—యేశిసినట్టే వుంది. యీయెదవబయం సాలు సాలు అదిగో గోపిగా డేదో సెపుతున్నా డినండి.

2 గొ—యేంది బాబూ సెప్పు సెప్పు (వానిమీద పడును)

గో—నీముండా మొయ్యా నామీద బడతా వేందిరా అయితే మీాయిట్టం వుచ్చిన ట్టేడవండి నేసెప్పను పోండి

3 గొ—సెప్పరా గోపిగా యీపట్టు నీమీా దెవ డడ్డా యేసుకుంటే

గో—అదిగో సూడండి ఆకుట్టయ్య జేసినా డిదంతా రోలొకటి నడుం కేసుకుని ఆరెండు సెట్లకీ మద్దిని దూరి యేమని చెప్పనురా బాబూ ఊ అని ముందు కుటాయించాడురా ఆపళంగా రెండు చెట్లూ గబేల్మి బడ్డాయి నే నీసెట్టు కాడనుంచి తొంగి చూసున్నాను నా పానా లప్పుడే పోనా యనుకున్నా.

4 గొ—ఏడీ కుట్టయ్యేడీ ఆసెట్లకిందొడిపోనా డేమో లెగదీద్దాం నడండిరా.

కృ—నేనీపాటి కింటికి బోయెదగాక వీరలకు గానరాకుండ బోయెద (పోవును.)

1,2,3 గొ—ఏడి రా యెక్కడున్నాడ్రా సూ బెట్టు సూ బెట్టు. (ముందుకు బోయి) యేంరా గోపిగా యెక్కడ్రా.

గో॥త॥ యిప్పు డిక్కడ నున్నాడే యింతలో నెచ్చటికే బోనాడు నాకూగ
నమట్టంలే యింతలో యెక్కడికి బోనాడో

1 గో—ఎన్నబద్దాలు గలిపించి సెప్పావురా ఒరే వీడే యీఅబద్దా లన్నీ సెప్పాడు అంతా వృట్టిదేసరా తన్నండి మాదచ్చోదుని అబద్దా లెప్పుడూ సెప్పకుండా (అందరును తలయొక దెబ్బ వేయుదురు వాడు తప్పించుకొనుచు పారిపోవును, వాని వెంట దరుముచు అందరును పరుగెత్తుదురు).

తెరపడును.

---



# కృష్ణలీల.

## చతుర్థాంకము.

---

రంగము బృందావనములో నొకభాగము.

కృష్ణుడు గోపాలురతో ప్రవేశించును.

1గో—కిట్టయ్యా కిట్టయ్యా, మనగొల్లపల్లెకంటె యిక్కడ మా బాగా వుంది సుమా.

2గో —బుందావనం అంటే యేంటనుకున్నావు మరి.

కృ—మిత్రులారా మనకిక్కడ ఆడుకొనుటకు కావలసినన్ని చోట్లు న్నవి. చెడుగుడి కోతికొమ్మచ్చి పచ్చాకాటలు అన్నిఆడుకో వచ్చును.

3గో—అవును కుట్టయ్యా మాబలే గా వుంది.

4గో —మనపెద్దోళ్లిందుకోసమే యిక్కడి కొచ్చారు.

కృ—మిత్రులారా మీరందరు ను చద్దికావిళ్లు తెచ్చుకున్నారా లేదా.

గొల్లలు—కుట్టయ్యా అందరం తెచ్చుకున్నాము.

కృ —మధ్యాహ్నమయినది దూడలు చాలా దూరము పోయినవి. మళ్లించుకొని రండు. చల్దియన్నములు దినవచ్చును.

గో—అవును వేగి ఆకలి గూడ అవుతూంది. కిట్టయ్యోయ్ అదిగో మీ యన్నయ్య గూడ చద్దికావి డేసుకొచ్చాడు. మీఅన్నయ్యకు నీమీద యెంతి పేమనుకున్నావు.

(బలరాముడు కావడితో ప్రవేశించును.)

కృ—అన్నయ్యా నీ వీనాడు రావేమో అనుకొన్నాను.

రా—తమ్ముడా నిన్ను విడచి యుండగలనా.

కృ—అన్నయ్యా అటు చూడు ఆదూడ మంచిబాగుగా నున్నది.

బ—తమ్ముడా అది నిజమగు క్రేపు గాదు. అదేవో రాక్షసమాయ యగును.

కృ—సరే చూతును గాక క్రేపుదగ్గర గా జని ఓహో వత్సాసురుల వారా తమరు. మీకిదే బహుమానము గొనుడు. అని పలికి వెనుకటి రెండుపాదములను బట్టుకొని గిరగిర త్రిప్పి అక్కడి వృక్షమున వైచి కొట్టును. రాక్షసుడు ఘోరముగా బడి చచ్చును.

1గొల్లలు—అయ్యబాబోయి అది నిజంగా దూడే అనుకున్నాం యెలాగ గనిపెట్టావో కిట్టయ్యా మామంచిపని సేశావు.

2గొ—దీనితస్సా దియ్యా ఎంతరు పరిచిందిరా. బాబోయి మంది కుట్టయ్య లేక మోతే మనపని యేమగును.

3 గొ— యీపాటికి దానికుడిజొక్కలో కొట్టుకుంటూ యుందువు.

2 గొ—నీవు మాత్రం మిగుల్దాం అనుకున్నావు గావాల అందర్ని ఒర సెట్టకుండా మానక పోవును.

బ॥రా—తమ్ముడా యీకాసారమున నించుక నీరంబులు త్రావి వత్త ము రమ్ము అందరు ను కొంతముందుకు జరిగి నీరు త్రాగుట నభినయింతురు.

బ॥రా—తమ్ముడా కృష్ణా చూచితివా ఆచెట్టుక్రింద దపము చేయు చున్న కొంగ ఇంతిపెద్దది గా నున్న దేమి.

1 గొ—ఎక్కడయినా యెప్పుడైన యింతపొద్దు కొంగని సూశా వా యెంతపొడుంది రా బాబూ.

2 గొ—దీనిదుంప దెగా దాని ముక్కెంతపొడుగ్గా వుందో సూడ్రా.

కృ—అన్నా యిది నిజముయిసకొంగ గాదు దీనిమాయతనము నిప్పుడే మీ కెరుక పరచెదను చూచుచుండుఁడు. అని ముందునకు నడచి ఓహో స్వామివారు ధ్యానము చేయుచున్నారు గాబోలు శిష్యుడను నన్నొకసారి వీక్షింపుడు నే నెవ్వఁడ నో యెరుంగుదురా. నే నాలకాపరిని కృష్ణుఁడను అని దగ్గరగా నరుగును.

కొంగ కృష్ణుని గుటుక్కున మ్రింగి వయిచును.

బ|రా—ఏమీ యీరాక్షసుని క్రౌర్యము మాతమ్ముని మ్రింగి వైచినాడు.

1 గొ—రామయ్యోయి కిట్టయ్యోడి కిట్టయ్యోడి.

2 గొ—యీపాడుకొంగ యెక్కడనుంచి దాపరించింది నాయనా.

బ|రా—గోపాలకులారా భయము లేదు మాతమ్ముని నేను తీసికొని వచ్చెద నుండుడు (బలభద్రుఁడు కఱ్ఱతో కొంగనెత్తి పై గొట్టును. కొంగ కృష్ణుని గ్రక్కి ముక్కుతో పొడిచి చంపఁబోవ కృష్ణుడు రెండుగా బట్టి చీల్చి పారవైచును.)

గోపాలకులు పరుగెత్తుకొని వచ్చి కృష్ణుని కౌగిలించుకొని అమ్మయ్యా. యిప్పటికి బ్రతికాం కిట్టయ్యా నిజం గా ఆకొంగ మింగేసిందనుకున్నాం.

కృ—గోపాలకులారా చూడుఁడు మనక్రేపులు చాల దూరముగా బోయియున్నవి వేగ మళ్ళించుకరండు చల్దులారగింతము.

గోపాలకు లందరు ఆలాగే చేస్తాం (అని కర్రలు దీసికొని బయలుదేరి పోవుదురు.)

(అఘాసురుడు ప్రవేశించి) (తనలో) నాయన్న యగుబకాసురుని వధించినవాఁ డీకృష్ణుడే గదా వీని నెట్లయిన తుద ముట్టింప వలయు. అది గాక కంసమహారాజు గూడ యీకృష్ణు నెట్లయిన జంపవ

లయు నని యాజ్ఞాపించి యున్నాడు అదిగో గోపాలకు లందరు ను గోసంఘమును తోలుకొని వచ్చుచున్నారు గావున నేను వీరలమార్గంబున కడ్డమై సర్పాకృతిని ధరించి యుండి మ్రింగెదగాక అనంతరము కృష్ణుడు రాక మానడు అప్పు డాతనిగూడ గుటుక్కున మ్రింగి నాయన్నను జంపినపగ దీర్చికొనియెదగాక (అనిపోవును.)

తెరలో

చూడండిరా చూడండిరా యెంతుందో.

మ॥ ఒకవన్యాజగరేంద్ర మల్లదె గిరీం ♦ ద్రోత్సేధమై దావపా
వకకీలాపరుషప్రచండతరని ♦ శ్వాసంబుతో ఘోరవ
హ్నికరాళాశితజిహ్వతోడ మనలన్ ♦ హింసింప నీక్షించుచున్
వికటంబై పడి సాగియున్నది పురోవీధిం గనుంగొంటిరే.

మరల తెరలో

మనకృష్ణు డుండగా మనల నీపాము జేత్తుందిరా రండేసి తలో దెబ్బ వేయండిరా చస్తుంది కొట్టంగి పొడవండి.

కృ—(ఆలకించి) (తనలో) ఆహా యెంతవిపత్తు సంభవించినది.

ఉ॥ అర్భకు లెల్ల పాము దివి ♦ జాంతసుడౌట నెఱుగ రక్కటా
నిర్భయు లై యెదుర్కొనిరి ♦ నే గల నంచు విమూఢు లౌచు నా
విర్భవదాగ్రహత్వమున ♦ వెన్నగులం దమలేగపిండుతో
దుర్భరఘోరసత్వఘన ♦ తుండ బిలాంతముం జొచ్చి రందఱున్.

అక్కటక్కటా రేమియు నెఱుంగని యీబాలు రందరును యీ ఘోరరాక్షసునివాత బడిరి. కటకటా వీరల నందర విడచి యింటి కేగుట యెట్లు యింటికేగిన వెంటనే

చ॥ పడుచులు లేగలుం గలసి ♦ పైకొని వత్తురు తొల్లి కృష్ణ మా
కొడుకుల దేల రారనుచు ♦ గోపిక లెల్లరు బల్క నేక్రియన్

నోడిపెద నేడు పన్నగము నోరికి వీరికి నొక్కలంకెగా
నోడబడ నేల జేసె విధి యోడక సేయుగదయ్య క్రౌర్యమున్॥

మరల తెరలో

ఓకుట్టయ్యోయి, ఓకుట్టయ్యో ఋ

కృ—కట్టా యెట్లయిన వీరల రక్షింపకుండ నేనింటి కేగను. (లోనికి బోవును.)

బ—అదిగో మాకృష్ణుడు గూడ పోవుచున్నాడు. అదిగో గుహాముఖముం బోలునాసర్పముఖమున బ్రవేశించుచున్నాడు. అయ్యోయయ్యో మాకృష్ణునిగూడ మ్రింగివైచు చున్నదే. (సంతోషముతో) అదిగో అందరిని గ్రక్కివైచినది పాము మృతినందినది. అదిగో కృష్ణుడిటే వచ్చుచున్నాడు.

కృ—(ప్రవేశించి) అన్నా యీసర్పరూపు డఘాసురుడు సుమా.

బ—అట్లనా కృష్ణా చల్దులారగింతమా!

కృ—అవును కాలాతీత మగుచున్నది. గోపాలకులవైపు తిరిగి

శా॥ ఎండం మ్రగ్గితి రాకటం బడితిరిం కేలా విడంబింపఁ గా
రం డోబాలకులార కూడు గుడువన్ రమ్యస్థలం బిక్కడీ
దండ న్లేగలు సీరుద్రావి యిరవం దం బచ్చిక ల్మేయుచు
దండంబై విహరించుచుండగ నమం దప్రీతి భక్షింతమే॥

1 గొ—(గోపాలకులు ప్రవేశించి) కుట్టయ్యా సీపుణ్ణెమా అని యీపాయేలకు బతికాం. బేగితిని కూకుడుందాం ఆకలిగూడా అవుతూంది ఇప్పండి కావిళ్లిప్పండిరా. ఒరే బసవన్నా నాకూడు గిన్నియిలాగ పడేరా.

2 గొ—గిన్నట్టుకు రాకురా గిరాటెయ్యేసి. ఆడిపొగరు వ్రేదులుతాది.

1 గొ—ఒరే గిరాటేశావంటె మామ్మసలమ్మ నిన్నూ నన్నూ గూఢా సంపేత్తుంది.

బ—ఇదిగోరా నీగిన్ని కాసుకో వదిలిపెడుతుండా (బెదిరించును.)

1 గో—అమ్మనయ్యో ఆలాంటిపని సెయ్యబోక. నేనొత్తుంనా నుండు.
(పరుగెత్తి వెళ్లి తెచ్చుకొనును)

3 గో—వాడిపొగరు మాబాగా గుదిర్చావురా బసవా.

4 గో—ఏళాకోళాలు చూని బేగి కూళ్ళుదినండిరా ఆడుకుందాము.
(అందరును గిన్నెలు ముందుబెట్టుకొని) కుట్టయ్యా కూళ్ళుదిని యేదయినా ఆడుకుందామా.

కృ—ఆలాగే ఆడుకోవచ్చును (రామునివంకదిరిగి) అన్నా! మనమిరువురము ఇక్కడ తిందము రమ్ము. (కృష్ణబలరాములు తినుటనభినయింతురు.

1 గో—ఒరే సూరన్నా మావాళ్ళియాల ఊరగాయ యెయ్యటం మరిచి పోయ్నిట్టున్నారు. నీదగ్గిరుంటే కాత్తిద్దా యీయాలకి.

సూ—అయ్యబాబో నాకేసాలదు. యింకో రెండుముక్కలున్నా యెగరెయ్యగలను. (అనిగిన్నె తీయును.)

2 గో—మనలోమనం చద్దుకోకమాతే యెలాగరా. ఆడుట్టికూడు యేలాతింటాడా యెవళ్ళదగ్గరేనా వుంటే కాస్తెట్టండిరా.

3 గో—అందరిదగ్గరా ఒక్కొక ముక్కేవుందిరా రెండుముక్కలుంటే ఒకటిపెట్టొచ్చుగాని ఒకటేవుంటే యెవడిస్తాడా.

బ—ఒరేయి సూడండిరా యీసూరన్నదగ్గర రెండుముక్క లున్నాయిరా.

4 గో—మనమాట్లిని అన్నంలో కప్పెడుతుండాడు సూడండిరా.

2 గో—ఉంటే ఒకముక్కెట్టరా.

సూ—నిన్ను సంపుకుతిన్నట్టు లేవురా. పూరగాయముక్కకే అబద్దం ఆడుతానురా ఒట్టు,

4 గో—నేనిప్పుడు సూపెడతాను రండిరా.

(సూరన్న చుట్టు అందరు జేరి మొతకండిరా మొతకండి అందురు.)

సూ—నాగిన్ని ముట్టుకున్నారంటే సూసుకోండి, లేవని జెపుదూంటే యినమట్టంతే,

2 గొ—(బసవన్నతో) అయినా యేం సేత్తాపో సూద్దాం నువ్వోళ్ళి గిన్నట్టుకోరా.

బ—సూరన్నా ఆడి కోముక్కంటే పెట్టగూడదంటూా.

సూ—మాఆవకాయంటి మంచావకాయ యెక్కడా లేదు యీాడు దిన్నాడంటే రోజూ దెమ్మంటాడు.

బ—యీాయాలకి ఆకూటిలో దాచినముక్కెట్టర్రా (అనిగిన్నెపట్టుకొనును.)

సూ—నాగిన్నె నిన్నెవ్వడు ముట్టుకో మన్నాడు (గెంటును.)

బ—నీకూడేం బట్టుకొని పోయినానా యేంచేసి (మరలగెంటును)

సూ—నాగిన్నందుకొని పైగా నన్ను గెంటుతావురా(వీపుపైచరుచును)

బ—యెంత దెబ్బ గొట్టేవురా మూ తిరిగి బోద్ది సూడు (అనికలియబడును) యిరువురు మల్లయుద్ధము సేయుదురు.

2 గొ—ఒరే యిదే చమయంరా.

3 గొ—యిదిగోరా అన్నంకప్పెట్టాడు తీసి యిచ్చును.

2 గొ—యీారెండోముక్క యీాలా పారయిరా మనం గూడా రుచి చూద్దాం.

3 గొ—మరి ఆడికో.

2 గొ—ఆడిమాట సూసుకుందాం లెద్దూ అని తీసికొని చప్పరించి అవునురోయి మాబాగా వుంది ఆడితో నే తీశా నని మాత్రం సెప్పకు.

3 గొ—నాసామ్మేం బోయింది.

4 గొ—ఆళ్లలా దెబ్బలాడుతూంటే యిడిపించ రేంరా.

(అందరు లేచి వారలను విడిపింతురు.)

సూ—నన్నాట్టుకోకరండి యిడిసి పెట్టండి ముక్కుమీద గుద్దుతాడా యీడిముండా మొయ్యా.

బ—ఆ డిడిని పెట్టమంటే యిడవకేంరా యింకోమాటు కావాలిగా మోను రానీండిరా.

సూ—కొడుదుఘ గాని లే యింటికాడి కెల్లాల నీపని సెప్పాల

బ—యిక్క డింత సెప్పావు యిక సెపతావు జాగత్త సామీదకొచ్చావంటే పక్కలిరగ దన్నేత్తా

సూ—తెందు గానలే మాఅన్నతో సెప్పానంటేసరి

2 గో—ఊరుకొండిరా కూళ్లు దినండి.

బ—నాగిన్నేదిరా

4గో—యిదిగో అని యిచ్చును...

బ—(గిన్నెచూచుకొని) నాపచ్చ డేదిరా యెవ డా తీసినోడు సెప్పండి.

2గో—ఆడావకాయముక్క, నీపచ్చడి గూడా దెబ్బలాడుకుని పారి పోయినాయిరా ఎతుక్కోండి.

సూ—నా రెండావకాయముక్కలూ దొబ్బేసినారు.

బ—ఆలా కావలసిందే.

సూ—నీకూ అంతే లే

1గో—మీ రిద్దరూ దెబ్బలాడుతూంటే యెవడో తీసుకు తిన్నాడు గావాల.

బ—అందరిగిన్నెలూ చూచి ఇదిగో (వెనుకకు గెంటి) యీడు తీసుకు దిన్నాడు. నీ బాబుగారు దనుకున్నావా యేం,

3గో—ఆడావకాయముక్క, ఆడి కిమ్మనడానికి నీ బాబుగారి దనుకున్నావా ఆవకాయ ఆడు దింటే నీపచ్చడి నేదిన్నాను. గెంటావంటే మాటదక్కదు. కూడుదిన్నాక సమాదానం చెపతా నెల్లు.

సూ—ఆవకాయ పోతే పోయింది గాని యీాడనబం ఝూడికయింది.

బ—నాపచ్చ డిచ్చి మరీ కదులు. (జుట్టు బట్టుకొనును.)

4—సూసార్యా యీాడిని.

2గొ—యీా డందరిమీాదికి సిద్దం తలొకటి యేసుకోండి (అందరూ
తిలయొక దెబ్బ బసవన్నను గొట్టుదురు)

సూ—గంతులు వేయుచు నన్ను గొట్టినందుకు మాబాగా అయింది.
ఇంతే యీాడికి సిచ్చ.

బ—కిట్టయ్యోయి యీాళ్లు బాదేత్తున్నారు చూసేవా

కృ—వ నిని వృదిలిపెట్టండి. (వదలివేయుదురు.)

కృ—బసవన్నా యెందుకు గొట్టినారు నిన్ను.

బ—ఆడిదగ్గిరావకాయముక్క లుంటే ఆడికొకము క్కయ్యమని ఆడి
గిన్నట్టుకున్నాను. ఆపాలంగా నాపచ్చ డింకోడు దొబ్బేశాడు.

4గొ— ఆడిగి న్నట్టుకుని ఆడిని గొట్టావా లేదా.

కృ—ఇద్దరిదీ తప్పే. యిద్దరూ గూడా తినండీ. నేనూరంగాయి
యిస్తాను (యిచ్చును.)

అప్పుడు యిద్దరును భుజింతురు.

గో—కుట్టయ్యో కుట్టయ్య మనమంద లేమయి పోనాయో గదా
(యిటు నటు చూచుచుందురు).

కృ—గోపాలకులారా!

మ॥ వినుడో బాలకులార క్రేపు లటవీ • వీథిన్ మహాదూరముం
జనియెన్ గోమలఘాసఖాదనరతోత్సాహంబుతో నెందు వ్రా
లెనో యేమయ్యెనో క్రూరజంతువులచే నేయాపదం బొందెనో
గని తెత్తున్ గుడువుండు చల్ది కొరత ల్గాకుండ మీరందఱున్.

(అని అడవిలోనికి పోవుచు.)

మ॥ ఒకఁడైయుంటివి బాలవత్సములతో నొప్పారి నీవంతటన్
సకలోపాశ్రితులై చతుర్భుజులునై సంప్రీతితో గొల్వఁగా
బ్రకటశ్రీగలవాఁడవైతి విపుడున్ బ్రహ్మాండము ల్వ్యాపి యొ
ల్లక యిట్లొక్కఁడవైతి నీవివిధలీలత్వంబు గంటింగదే.

తండ్రీ నారాయణా నాయొక్క కోరిక మన్నింపుము.

శా॥ దేవా నీచరణప్రసాదకణలబ్ధిం గాక లేకున్న నొం
డేవెంటం జను నీమహామహిమ నూహింపం గ నెవ్వారికిన్
నీవారై చనువారిలో నొకఁడనై నిన్గొల్చుభాగ్యంబు నా
కీవే యిప్పటిజన్మమందయిన నొండైన నోయీశ్వరా.

దేవా యెంతకొనియాడినను నీగుణము లనంతములు. గదా.

ఆ॥వె॥ ఆశ్రయించుజనుల కానందసందోహ
మీఁ దలంచి వివిధ హేలతోడ
నప్రపంచకుండ వయ్యుఁ బ్రపంచంబు
వెలయఁ జేయు దీవు విశ్వమూర్తి.

కం॥ సర్వము నీవ యెఱుంగుదు
సర్వవిలోకనుఁడవీవ జగదధిపతివిఁక
సర్వాపరాధు నను నో
సర్వేశ యనుగ్రహింపు చనియెద నింకన్.

కృష్ణు—విధాతా చనుము గోపాలకులారా అదిగో ఆయమునాతీరమున
కరిగి యాటలాడుకొందము రండు.

అందరు పోవుదురు.

తెరపడును.

రంగము.

యశోద విచారముతో నుండును.

యశో—అక్కటా యీదినంబున నేలకో నామానస మాందోళనాయ
త్తమై యున్నది విచారమునకు హేతువు గానరాదు. ఉదయ

## చతుర్థాంకము.

మునకే గోపాలురతో గలసి యడవి కేగిన గోపాలుం డింతవరకు రాలేదు. ఎన్నడును నింతయాలస్యము చేయువాడు గాదు ఏమి కీడు మూడినదో గదా. హా దైవమా నాముద్దులకుఱ్ఱను జూపి రక్షింపుము. కటా అన్నియు దుర్నిమిత్తములే గానవచ్చుచున్నవి. ఏమి కానున్నదో గదా. అదిగో గోపకుమారు లిరువు రీవలకే పరుగెత్తి వచ్చుచున్నారు వారిని గనుగొనియెద.

గోపాలకు లిరువురు ఒగర్చుచు పరుగెత్తుకొని వచ్చి నిలుతురు.

య—(వారలను జూచి) గోపబాలులారా యింతయాయాసముగా వచ్చితి రేమి?

గో—ఏడ్చుచు నూరకుందురు.

య—ఏమర్రా మీ రేడ్చుచున్నారు కారణ మేమి మాకృష్ణు డేడీ.

1 గో—యశోదమ్మా (యని గట్టిగా నేడ్చును)

య—(కన్నీళ్లతో) మాకృష్ణువాని కేమి కష్టము గలిగినది చెప్పు నాయనా.

2 గో—(కన్నీళ్ళు తుడుచుకొని) అమ్మా యేమని చెప్పగలను మేమంతా అన్నము దిని యమునానదిప్రక్కున ఆడుకుంటున్నాం ఆడుకుంటూ ఆడుకుంటూ వుండగా మాకందరికి దాహం అయింది ఆపళంగా ఆనదిప్రక్కు కెళ్లి నీళ్ళు దాగేశాం అక్కడనుంచి మేము వొళ్ళు దెలియకుండా పడిపోయినాం కృష్ణమూర్తయ్యా యేంజేసాడో మమ్మ ల్నందరిని బతికించాడు.

య—(ఆతురతతో) తరువాత నేమి జరిగినది.

2 గో—యేం జరిగిందా కృష్ణయ్యా యీపాటి కింటికెళ్లిపోదాం రమ్మన్నాం. మా మాటవినకుండా యేంటి యీమడుగులో పామున్నది దానిని లేవగొట్టి వస్తానని చెప్పాడు మేమందరము వొద్దు

మొల్లోద్దు కుట్టమ్మో యని యెన్ని కేకలేస్తూన్నా మాట విను
పించుకోనకుండా.

మ॥ కటిచేలాంబు బిగించి పింఛమును జొక్కాగొప్ప బంధించి దో
స్తటసంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబు గీలించి త
త్కుటశాఖాగ్రముమీద నుండి యురికెన్ గోపాలసింహంబు ది
క్తటము ల్మోఁగ్రయ హ్రదంబులో గుభగుభధ్వానంబనూనంబుగన్

య——ఆహా కుమారా యెంతపని చేసితివి. తరువాత నేమిజరిగినది.

1 గో——కొంతసేపటిదాకా మరల తేలే లేదు. అప్పుడు పెద్దపా మొకటి
బయలికొచ్చి

శా॥ బాలుం డొక్కఁడు వీఁడు నామడుగు వి భ్రాంతోచ్ఛలత్కర్ణక
ల్లోలంబై కలఁగ న్జరించె నిటనే లోనుండ జూడంబు మ
త్కీలాభీలవిశాలదుస్సహవిషా గ్ని జ్వాలలన్ భస్మమై
కూలం జేసెద నేఁడు లోకులకు నాకోపంబు దీపింపఁ గన్॥

అని మనకృష్ణుని చుట్టేసుకు కూర్చున్నది.

య——కటకటా యెంతటియవస్థ సంభవించెను. హా తనయా

కం॥ కట్టా క్రూరభుజంగము
కట్టలుక న్నిన్నుఁ గరువఁ గంపించితివో
తిట్టితివో పాపవిధిఁ
బట్టి మముం దలఁచి కాఁకఁ బలవించితివో।

గోపాలులారా! యింక నేనిట నిలువఁజాల మాకృష్ణు డున్నయెడకు గొని
పొండు. ఆలస్యము చేయకుడు దారి చూపుడు.

గో——ఇటు ఇటు (అందరు పోదురు.)

[తెరయెత్తగా కాళిందీమడువున సర్పమస్తకమున కాలూని కృష్ణుడు గ
నఁబడును. యశోద గోపాలురు ప్రవేశింతురు.]

గో—అమ్మా ఇటు ఇదిగో చూడుము అదుగో మనకృష్ణుడు ఆమడుపులో
నిశ్చేష్టుడై యున్నాడు. చూడుము. ఆవంకకు చూపుడు.

యశో—(చూచి దుఃఖముతో) నాతండ్రీ నాముద్దులయ్యా నాగోపాలకృ
ష్ణా అదేమి అట్లుంటివి. తండ్రీ నాప్రారబ్ధము నిన్నిట్లీడ్చుకొని
వచ్చినదా!

సీ॥ ఎదురు వచ్చినఁ జాల ♦ నెదురుగాఁ జను దెంతు
వెదురు వచ్చిన నేడ ♦ దేల రావు
చూచినఁ గృపతోడఁ ♦ జూచుచుందువు నీవు
చూచినఁ గను విచ్చి ♦ చూడవేల
డాసిన నర లేక ♦ డాయంగ వత్తువు
డాసిన నేటికి ♦ డాయ విచట
జీరిన నో యనిఁ ♦ చెలరేగి పలుకుదు
విది యేమి చీరిన ♦ నెరుగ కుంట

ఆ॥వె॥ తలపు సేయునంత ♦ దలపోయు చుందువు
తలపు సేయ నేడు ♦ దలప వకట
నే యశోద నయ్యా ♦ నీకూర్మిదల్లిని
జూడ వేమి మాట ♦ లాడ వేమి.

అక్కటా పాపపువిధి యెంతదలపెట్టినదిరా తండ్రీ.

కం॥ పన్నగము మమ్ము గరువక
ని న్నేటికి గరచె కుట్టి ♦ నెమ్మి గలిగి నీ
వున్నను మము రక్షింతువు
నిన్నున్ రక్షింప నేము ♦ నేరము తండ్రీ.

ఆమడుపులోని కెందుకు దిగితివి రా తండ్రీ నీమిత్రులైనగోపాలురు
నీకై యెదురు చూచుచుండిరి.

ఉ॥ చూడ వదేమి గారవపు ✽ చూపుల మమ్ము సఖీతోడ మా
టాడ వదేమి మర్మముగ ✽ నందెలు పాదములందు మ్రోయ నే
డాడ వదేమి నర్తనము ✽ లవ్వల మ్రోలను గోపికావళిన్.
గూడవదేమి నవ్వులకు ✽ గోపకుమారవరేణ్య చెప్పుమా.

తనయా నీముద్దుపలుకు లాలకింపకుండ నే జీవించుటెట్లు.
నన్నమ్మా యని బిలచి యేమయినం బెట్టుమా యని పెట్ట
కున్న నల్లరి సేయు వా రెవ్వరు రా యింక తండ్రీ.

సీ॥ శ్రవణరంధ్రంబులు ✽ సఫలత బొందం గ
నెలమి భాషించువా ✽ రెవ్వరింక
కరచరణాదుల ✽ కలిమి ధన్యత నొంద
నెగిరి పైఁ బ్రాకువా ✽ రెవ్వరింక
నయనయుగ్మమ్ములు ✽ న్నతిఁ గృతార్థములు గా
నవ్వులు చూపువా ✽ రెవ్వరింక
జిహ్వలు గారవ ✽ శ్రీఁ జేర బాటల
నెడఁ బలికించువా ✽ రెవ్వరింక
తండ్రి నీవు సర్ప ✽ దష్టుండవై యున్న
నిచట మాకుఁ బ్రభువు ✽ లెవ్వరింక
మరిగి పాయలేము ✽ మాకు నీతోడిద
లోక మీవు లేని ✽ లోకమేల.

బలరాముడు వెనుక బయలుదేరి వచ్చి అమ్మావిచారము వీడుము.
మనకృష్ణుని కేమియు భయములేదు. అత డాదినారాయణుండు
గాని మనుష్యమాత్రుండు గాడు. అదే చూడుము.

చ॥ వెఱ వర లేని మేటిబల ✽ వీరుఁడు కృష్ణకుమారుఁ డొక్క చేఁ
జఱచి ఖగేంద్రుచందమున ✽ జక్కన దౌడలు వట్టి కన్నులన్

జొంజొంజ దుర్విషానలము ♦ జొబ్బిలుచుండ గ నెత్తి లీలతోఁ
జిలుజిలుఁ ద్రిప్పి నైచెఁ బరి ♦ శేషితదర్పముఁ గూరసర్పమున్.

యు—చూచి ఆహా ధన్యురాల ధన్యురాల.

ఉ॥ ఎట్టితపంబు చేసెనొకొ ♦ యెట్టిసుకర్మము లాచరించెనో
యెట్టినిజంబు వల్కెనొకొ ♦ యీఫణి పూర్వభవంబునందు ము
న్నెట్టిమహానుభావులకు ♦ నెన్నడు చేరువ గాని నీవు నే
డిట్టివినోదలీల దల ♦ కెక్కి నటించెద వీఫణీంద్రుపై

(అప్పుడు నీటనుండి నాగాంగనలు ప్రవేశించి తండ్రి దేవాదిదేవా
లక్ష్మీకళత్రా పురాణపురుషా (నమస్కృతు లొనర్చి)

క౦॥ క్రూరాత్ముల దండింప గ
ధారుణిపై నవతరించి ♦ తన రెడిసీ కీ
క్రూరాత్ముని దండించుట
క్రూరత్వము గాదు సాధు ♦ గుణము గుణాఢ్యా.

అయినను మామనవి నాలకింపుము.

శా॥ బాలుం డీతఁడు మంచివాఁ డనుచుఁ జెప్ప న్నాము క్రూరుండు దు
శ్శీలుం డౌట యు నైన నేము సుభగ ♦ శ్రీఁ గాసి వైధవ్య దు
ష్టాలంకారము బొంద నోడెద మనా ♦ ధాలాపమాలింపవే
చాలున్ నీపదతాడనంబు పతిభి ♦ క్షం బెట్టి రక్షింపవే.

గీ॥ మమ్ముఁ బెండ్లి సేయు ♦ మాప్రాణవల్లభు
ప్రాణ మిచ్చి కావు ♦ భక్తవరద
నీవు సేయు పెండ్లి ♦ నిత్యంబు భద్రంబు
పిన్ననాటిపెండ్లి ♦ పెండ్లి కాదు.

అప్పుడు కాళింగుడు మనుష్యరూపముతో వచ్చి కృష్ణునకు నమస్కరించి

క॥ నాపుణ్య మేమి చెప్పను
నీపాదరజంబు గంటి ♦ నే సనకాదుల్

నీపాదరజము గోరుదు
శేషపదం బున్ననైన ♦ నిట మేలు హరీ.

కృ—ఓయీ నీభార్యలదీనాలాపములచే రక్షించితిని గాని ముందు

క॥ గోవర్గముతో మానుజులు
తావృదు రీచుడువునీరు ♦ తగ దిం దుండన్
నీవు ను నీ బాంధవులును
నీవనితలు సుతులు జనుఁడు ♦ నే డంబుధికిన్.

నాగులు పోవుదురు.

కృ—యశోదకడకు వచ్చి అమ్మా పోదము రండు.

య—రా నాయనా నన్ను గన్నతండ్రీ (యని కౌగలించుకొని శిరము
మూర్కొనును)

బ—పోదము రండు.

అందరు నిష్క్రమింతురు.

తెర పడును.



# కృష్ణలీల.

పంచమాంకము.

---

రంగము బృందావనము.

విరహముతో రాధ ప్రవేశించును.

రా—అక్కటా యీవిరహతాప మెట్లు భరింతును. అదిగో అప్పుడు పుట్టి మునిగినట్లు

సీ॥ విటసేవ్యమై దంపు * పెడలెడివలలేని
గొల్లెవ్వమై హేమ * కుంభ మనఁగఁ
గాముకధృతివల్లి * కలు ద్రెంప నెత్తిన
శంబరాంతకుచేతి * చక్ర మనగ
మారుండు పాంథుల * మా నాటవులు గాల్పఁ
గూర్చిననిప్పుల * కుప్ప యనగ
విరహిణీమృగముల * వేటాడ మదనుండు
దెచ్చినమోహన * దీప మనగ

గీ॥ నింతనునుపు గల్గి * వృత్తమై యరుణమై
కాంతితోఁ జకోర * గణము లుబ్బ
పొడుపుగొండచక్కి * బొడిచె రాకాచంద్ర
మండలంబు గగన * మండలమున॥

ఓకృష్ణా మొక్కుచు నుంటిని. ఈమారుండు కూర్మరుండై మేనమామతో కలిసి నన్ను హింసించుచున్నాడు. ఓకరుణాపయోనిధీ రమ్ము దర్శనంబిచ్చి రక్షింపుము.

సీ॥ నీయధరామృత ♦ నిర్ఝరంబులు నేడు
చేరి నా తెరపైఁ ♦ జిలుకకున్న
నీవిశాలాంచిత ♦ నిర్మలవక్షంబు
కుచకుట్మలంబులఁ ♦ గూర్పకున్న
నీరమ్యతరహస్త ♦ నీరజాతంబులు
చికురబంధంబులఁ ♦ జేర్ప కున్న
నీకృపాలోకన ♦ నివహంబు మెల్లన
నెమ్మొగంబులమీఁద ♦ నెరపకున్న
గీ॥ నీనవీనమాన ♦ నీయ సల్లాపంబు
కర్ణరంధ్రదిశలఁ ♦ గప్ప కున్న
నెట్లుబ్రతుకువార ♦ మెందుఁ జేరెడివార
మధిప వినఁగఁ దగదె ♦ యాదుకులుడు॥

హాకృష్ణా యీబృందావన మంతయు దిరిగి తిరిగి వచ్చుచుంటిని. యింతకు నాపై దయ చూపకుండుట న్యాయమా. చిన్నతనమునుండియు నాయందెంతో యనురాగమును జూపుచుంటివి గదా. అయిన నీమల్లియల నడిగి చూచెద. (మల్లిపొదలదగ్గర కరిగి)

ఉ॥ నల్లనివాఁడు పద్మనయ ♦ నంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరి ♦ సర్పితపింఛమువాఁడు నవ్వురా
జిల్లెడుమోమువాఁ డొకఁడు ♦ చెల్వలమానధనంబు దెచ్చె నో
మల్లియలార మీపొదల ♦ మాటున లేఁడుగదమ్మ జెప్పరే॥

మీరలిప్పుడు మాటాడురోజులా కొద్దికాలములో మీపోగరణగును రెండు అయిన నీవంక కేగి వెతకెద గాక. (లోనికిబోవును)

(ఇంకొకవంకనుండి చంపక ప్రవేశించును.)

చం॥

సీ॥ మానినీ మన్మథు • మాధవుఁ గానరే
సలలితోదారవ • త్సకములార
సలలితోదారవ • త్సకవైరిఁగానరే
సుందరోన్నతల తా • గ్జనములార
సుందరోన్నతలతా • గ్జనభంజుఁ గానరే
ఘనతరలసదశో • కంబులార
ఘనతరలసదశో • కస్ఫూర్తిఁ గానరే
నవ్యరుచిరకాంచ • నంబులార

గీ॥ నవ్యరుచిరకాంచ • న కిరీటుఁ గానరే
గహనపదవిఁగురువ • కంబులార
గహనపదవిఁగురువ • కనివాసిఁ గానరే
గణికలార చారు • గణికలార॥

ఏమిది యెవ్వరును మాటాడరు అందరకును విరోధి నయితినా హా కృష్ణా నీవే నాప్రాణము. నీవే నాజీవితము నీవే నాదైవము యింత యేల నీవే నాసర్వస్వము. నిన్ను విడచి యొక్కనిముస మయిన గడువ జాల రమ్ము ప్రియుపై కరుణింపుము. కాగలి యిమ్ము. ఈతాప మింక భరింపజాల.

సీ॥ ఈపంచబాణాగ్ని • కేమిట నార్తుము
నీమంజువాగ్వృష్టి • నెగడదేని
నీమన్మథాంబోధి • నేతెప్పఁగడతుము
నీదృష్టి నావయై • నిలువదేని
నీచిత్తజధ్వాంత • మేజాడఁ జెరుతుము
నీహాసచంద్రిక • నిగుడ దేని

నీదర్పకజ్వర ♦ మెట్టంగి సడలుము
నీనవాధరసుధ ♦ నింపవేని
ఆ॥వె॥ నెట్లు నిర్వహింతు ♦ మేలాగు మాలాగు
కరుణ సేయ వేని ♦ గదియలేని
మరుఁడు నిర్దయుండు ♦ మననిచ్చు నే యశో
దాకుమార యువతి ♦ ధైర్యచోర.
మ॥ భవదాలోకనఘోషగీతజమూలై ♦ భాసిల్లు కామాగ్నులన్
భవదీయాధరపల్లవామృతముచే ♦ బాపన్దగుఁ బాపవే
నివి యోగాసలహేతిసంహతులచే ♦ స్థిరై భవచ్చింతలన్.
భవదంఘ్రిద్వయవీధిఁ బొందెదము నీ ♦ పాదంబులే యానగాన్.
అదిగో వేణుగాన మావంక వీనులవిందుగా వినుపించుచున్నది. వెదకి
గనుగొనియెద గాక (లోనికి బోవును.)
కృష్ణుడు (ప్రవేశించి) అదిగో నాకొరకై గోపికలు పలవించుచు వన
మంతయు దిరుగుచున్నారు. ఇక్కడనుండి గనుకొనియెదగాక.
(యిటు నటు దిరుగుచుండును.)

తెరలో రాధ

సిరికిను దారచిహ్నములు ♦ సేయుభవచ్చరణారవిందమున్
సరసిజనేత్ర నాతపము ♦ సంపదఁ జేరితి నెట్టకేలకున్
మరలగ లేను నామగని ♦ మాటలనొల్లను పద్మగంధమున్
మరిగిన తేటి యన్యకుసు ♦ మంబులచెంతకుఁ జేర నేర్చునే॥
హాకృష్ణా యీదీనురాలను రక్షింపుము.
కృ—అదిగో మా రాధ నన్వేతకు కొనుచు యిట్లేవచ్చుచున్నది.
(రాధ ప్రవేశించి యిటునటు జూచి పరమానందముతో) హాకృష్ణా యి
న్నాళ్ళకు నాతపము ఫలించినది. (కౌగలించుకొన బోవును)
కృ—(దూరముగానరిగి) రాధా యేమిది.

శా॥ మేలా నీకు భయంబు • పుట్టదుగదా మేదుంగడు న్సింహశా
ర్దూలానేకపముఖ్యము • ల్దింగెడిన్ దూరంబు లేకంతు రే
యేలా వచ్చితి వీనిశాన • మయమం దిచ్చోట వర్తింతు రే
చాలుం జాలు లతాంగి వేగ • చనుమీ సంప్రీతితో మందకున్॥

యిట్టికృత్యముల నెవ్వారైన హర్షింపవలదా.

రా—కృష్ణా అయినచో నిదియంతయు నీదోషమే

కృ—నాతప్పేమి.

రా—నీవిట్లుండ బట్టియేగదా మామనంబు లిట్లు మారిపోయినవి.

కృ—నేనెట్లుంటిని అందరివలెనే యుంటినిగదా?

రా—(నవ్వుచు) అందరివలెనే యున్నచో నీకడ కేలవత్తును.

కృ—అందరికడకన్న నావద్దనున్నవిశేష మేమి.

రా—విశేషములు వేరెకొని తేవలయునా. నీరూపమును నీహాసమును కారణములు.

కృ—అందరికన్న నే నందమయినవాడనా.

రా—చూచుకొనరాదా నాచేత చెప్పించుట యెందులకు

కృ—చూచుకొనుట యెట్లు?

రా—చూపెదను రమ్ము.

కృ—ఎట్లు?

రా—(దగ్గరగా వచ్చి సరసను నిలిచి) ఇప్పుడు చూడుము నాకన్న నందముగా నుంటివా లేవా?

కృ—ఇంతమాత్రముచే నాకెట్లు దెలియగలదు.

రా—(ఇట్లు అని ముద్దుపెట్టుకొనును.)

కృ—ఇంతలోనే నేనందగాడ నని యెట్లు తెలిసినది.

రా—కృష్ణా నీవందగాడవు గాకున్నచో నేనేల ముద్దుపెట్టుకొందును.

కృ—ప్రేమచే పెట్టుకొన గూడదా.

రా—స్వతంత్రురవు గాకున్న స్వాతంత్ర్యమెట్లు గలుగును.

కృ—కుర్ప్రిమైన తమాత్ర్యము తల్లి ప్రేమ పోవునా.

రా—తల్లిప్రేమకును కాంతలప్రేమకును సంబంధము లేదు.

కృ—అర్ధరాత్రమున వచ్చుట తప్పుగదా.

రా—తప్పేయయిన చో నీదేయని చెప్పలేదా.

కృ—

చం॥ ఇలు వడి నున్న జేసి హృద ♦ యేశునిసిగ్గును జంపి యత్తమా
మల నెరియింఛి సోదరుల ♦ మానము పూనలు వృచ్చి తల్లిదం
డ్రులరుచి మాన్పి బంధులకు ♦ రోత యొనర్చుచు జారవాంఛలన్
వలనరి సత్కులాంగనలు ♦ వత్తురె లోకులు జూచి మెత్తురే॥

రా—కృష్ణా నీవెరుంగని దేమిగలదు.

పశులన్ బిడ్డల బంధుబన్ సతులనుం బాటించు ఏ ధర్మప
ద్ధతి నీవంటివి దేహధారిణులకు న్ధర్మజ్ఞ చింతింపుమా
పతిపుత్రాదికనామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందుఁద
త్పతిపుత్రాధికవాంచలన్ సలిపి సంభావించు టన్యాయమే॥

అది గాక.

సీ॥ నీపాదకమలంబు ♦ నెమ్మి దగ్గర గాని
తరలి పోవంగ బా ♦ దములు రావు
నీకరాబ్జంబులు ♦ నెఱి నంటినఁ గాని
తక్కనపనికి హ ♦ స్తములు చొరవు
నీవాగమృతధార ♦ నిండఁ గ్రోలఁగఁగాని
చెవు లన్యభాషలఁ ♦ జేరి వినవు
నీసుందరాకృతి ♦ నియతి జూడఁ గఁ గాని
చూడ, వస్త్వంబుల ♦ జూడ్కి కవలు
గీ॥ నిన్ను గాని పలుక ♦ నేరవు మాజిహ్వ
లొల్ల ననుచు బల్కు ♦ నోడ వీవు

పంచమాంకము.

మా మనంబు లెల్ల మరలించి దొంగిలి
తేమి సేయువార మింక కృష్ణ.

కృ—(తనలో) ఆహా గొప్ప చిక్కే గలిగినది.

చం॥ వనితలు నన్ను గోరి యిటు వచ్చిరి యింత గొరంత లేదు మే
లౌనరు సమస్తజంతువులు నోలిప్రియంబులు గావె నాకు నై
నను నిలుకం గఁ బోలదు న నాతనధర్మము లాడువారికిన్.
జెనిమిటులన్ భజించుటలు పెద్దలు చెప్పచు నుందు రెల్లెడన్.

(ఆలోచించి) ఔను వీరలకు పూర్వభవంబున నాచే వరం బీయఁ
బడెనుగదా. అందుచే ని దోషము వీరలకు లేదు.

రా—మనోవల్లభా యే మాలోచించుచుంటివి.

మ॥ అకటా నమ్మితి మేము క్రూరుఁడని వెనాశించి మాయిండ్లలో
సకలవ్యాప్తుల డించి నీపసరోజాతంబు లర్పింపఁ జ
క్కక యేతెంచితివిరాకుఁ డాఘ్యుఁడు ముముక్షాసక్తులం గాంచుపో
లికఁ గావం దగు గాపవే విమల మేలే కాంతలన్ భ్రాంతలన్.

గోపాలబాలా స్త్రీహత్యాపాతకమున కొడిగట్టకుము.

కృ—(తనలో) ఇకను గొందరు వచ్చుచున్నారు. ఈమె నింతటి
తో సంతోషపరుప వలయును.

రా—కృష్ణా యింక తాళజాల. ఒకరి నొకరు కౌగలించుకొందురు.

తెరపడును.

(చంపక ప్రవేశించి)

ఉ॥ ఆంగజు నైనఁ జూడ హృద యంగముఁడై కరగించువాడు శ్రీ
రంగదురంబువాడు మధుర బగువేణురవంబువాడు న
న్నంగజుపువ్వుదూపులకు నగ్గము జేసి లవంగలుంగనా
రంగములార మీకడకు రాడు గదా కృపనుంచి చూడరే.

తెరనుండివచ్చి
మీ రేల చూపుదురు యెవరియవస్థ వారే యనుభవింపవల
యును హా మనోహరా కృష్ణా యెందుబోయితివి.

ఉ॥ అక్కట బంధులు న్మగడు నన్నలు దమ్ములు పుత్రకాదులున్
నెక్కని రాత్రి పోకుఁ మన సీమృదుగీతరవంబు వీనులన్
వెక్కస మైన వచ్చితిని వేగమె మోహము నొంది నాధ నీ
వెక్కడ నుంటి వో యెరుగ నీక్రియ నిర్దయు డెందుఁ నల్లునే.

(తెరనుండి కృష్ణుడు ప్రవేశించి తనలో) యీగోపికలకోరికలు దీర్తు
నని మున్ను వరము లిచ్చియుంటిని గావున తప్పదు.

చం—(వెనుక దిరిగి చూచి) నాథా మనోనాథా నీకొరకై యింత
వెదకుచు దిరుగుచుండ నింత నిర్దయ వహించుట న్యాయమా.

కృ—కాంతా యింతయర్ధరాత్రమున నొంటిగా నిట్టు బయలుదేరి
వచ్చుట దగునా. దీనివలన నెన్నియాపదలు గలుగునో
యెరుగుదువా.

సీ॥ ప్రాణేశుఁ డెరిగిన ప్రాణంబునకు దెగు
దండించు నెరిగిన ధరణివిభుఁడు
మామ యెఱింగిన మనువెల్ల జెడిపోవు
దలవరి వినినను దగులు సేయు
తలిదండ్రు లెరిగిన దలలెత్తకుండుదు
రేరా లెరింగిన నెత్తి పొడుచు
నాత్మజు లెరిగిన నాదరింపరు చూచి
బంధువులెరిగిన బహి యొనర్తు

ఆ॥వె॥ రితరు లెరిగి రేని నెంతయు చుల్కగా
జూతురిందు నందు సుఖము లేదు

యశము లేదు నిర్భీ యానందము ను లేదు
జారు చేరఁ జనదు చారుముఖికి.

గావున మీవారలు వెతకుకొనుచుందురు. వేగ నింటికి జనుము సాహ
సము దగదు.

చం—కృష్ణా ఆమాత్రమాలోచన లేకుండ వచ్చితినని దలంచితివా?

కృ—ఆలోచించియే వచ్చినచో నీపాటికి వెనుక కరుగుము.

చం—ఎందులకు?

కృ—సుశీలత్వము గాపాడుకొనుటకు.

చం—వెనుక కరుగనిచో పతివ్రతనుగానా

కృ—పరపురుషుని గోరినచో జారి యనిపించుకొనవా?

చం—పరుని గోరిన చో నట్లేయగుదును.

కృ—నేను పరుడను గానా

చం—కావు

కృ—ఎందువలన

చం—సర్వభూతాంతర్యామి వగుటవలన.

కృ—అయినంతమాత్రమున నేపరుడను గాకుండు టెట్లు

చం—పరుడవయినచో నామనంబు నీయందు దగులదు.

కృ—ఎందువలన

చం—ఇదివర కెన్నడైన నొరుమందిని గనినను నామనంబు చలిం
చెనా?

కృ—ఇప్పుడేల చలించవలయును.

చం—నీవు నామనోనాథుడ వగుటవలన

కృ—నీమనంబునకు నచ్చిన సరి యగునా

చం—నామనం బన్యథా యెన్నడు నను చరింపదు, అందుచే సరియని
యెంచితిని.

కృ—పరులకు సరి యని దోపవలదా.

చం—ఇతరులకు తోచకున్న నష్టమేమి?

కృ—నష్టముగాదా, జారకాంతయని నింద బొందవలసివచ్చును.

చం—లోకులు కాకులువంటివారు. మంచిపని చేయుచున్నను చెడ్డ
గానే భాషింతురు. అట్లని మానకుందురా.

కృ—నీకాంతుడు విన్నవో నేమనును.

చం—నాథా యేల నన్నీప్రశ్నార్థములతో వేపెదవు. నీవే నాదైవమ
నియు నీవే నా కిహపరసాధన మనియు నెంచియుంటిని. ఎంత
పీవృథావాగ్వాదము. నిన్ను గనకుండ నరనిమున మయిన నోర్చి
యుండలేను. అదిగాక నాపతివిన్నమాత్ర మే మగును.

మ॥ మగువ ల్చిక్కరె తొల్లి వల్లభులకున్ ౯ మన్నించి తద్వల్లభుల్
మగపంతంబు తలంపరె తగులము ౯ ల్మానపాల నే పుట్టెచే
మగవా రాడెడుమాటలే తగవు నీ ౯ మాట ల్మనోజాగ్ని చేఁ
బొగులం జాలను కౌగిలింపుము ననుం ౯ బుణ్యాంబు పుణ్యాత్మకా

(కౌగలించుకొనబోవును.)

కృ—(తొలగి) కాంతా.

కం॥ ధ్యానాకర్ణనదర్శన
గానంబున నాతలంపు ♦ గల్గినఁ జాలున్
బూనెదరు కృతార్థత్వము
మానవతీ చనుము మరలి ♦ మందిరమునకున్॥

చం—ఇంత సేపాలోచన చేసి చెప్పినదియా చాలు చాలు

ఉ॥ కుండలదీప్తగండమును ౯ కుంచితకుంతలఫాలమున్ సుధా
మండితపల్లవాధరము ౯ మంజులహాసవిలోకనంబు నై
యూడెడునీముఖంబు గని ౯ యుండగ వచ్చునె మన్మథేక్షుకో
దండవిముక్తబాణముల ౯ దాసుల మయ్యెద మాదరింపవే॥

(అని కౌగలించుకొనుచుండ తెరయగును)

(తెర యెత్తగా గోపగోపికాసంఘము నిద్రించుచుండును. చుట్టును దావాగ్ని ప్రజ్వలించుచుండును.)

1 గో—(లేచి కన్నులునులుపుకొనుచు ముందునకు చూచి)అయ్యో బాబో యిదంతా తగులడిపోతూంది. లేవండర్రో లేవండి ఒరే పుల్లన్నా ఒరే బసవన్నా, ఒరే సూరన్నా లెగండిరా లెగండిరా సచ్చిపోతాం సచ్చిపోతాం లేవండిరా మీనిద్ర తగలెయ్యా లెగండిరా లెగండి.

2 గో—ఇంకోకప్రక్కకు దొర్లి యీశిపలవరింతలు తగలెయ్యా కాస్సేపయినా కునుకోనివ్వడు.

1 గో—ఓరి నీనిద్ర తగలమెట్టా యిదంతా మండిపోతూందిరా ఒకగోడియకు పెద్దనిద్రయి పోతుందిరా లేవండిరా.

2గో—(లేచి నలుదిక్కులు చూచి) అవునరోయి నిజమే నరోయి లేవండి కార్చిచ్చంటుకుంది అప్పుడే మంటలు మీద కొత్తున్నాయి (ఎరసనుంచి అందరను లేపును) అందరును లేచి యిటు నటు పరుగెత్తుదురు.)

1గో—బాబోయి చుట్టూ అంటుకుంది మనం పోన్యేటందుకు దారే గామట్టం లేదు రా బాబూ.

2గో—యీపక్క నుంచెలొచ్చునేమో సూత్తా నుండు (అటునడచి) అయ్యో దేవుడా యెంతగలొచ్చిందిరా.

(అందరును గోల పెట్టుచు నవ్వుచుందురు)

ఉ—(లేచి) ఓకృష్ణా ఆపద్బాంధవా రక్షింపుము.

మ॥అదె వచ్చె న్దవవహ్ని ధూమకణకీ కీలాభీలదుర్వారమై
యిదె కప్పెన్ మము నెల్లవారి నిట మీ కేలాగు రక్షింపు నీ
పదపద్మంబులె గాని యెంటెరుగ మో శ్రీపద్మాక్ష యో కృష్ణ మొ
క్కుదు మోరామ మహాపరాక్రమ దవాగ్నుల్వేగ వారింపవే.

# కృష్ణలీల.

కం॥ నీపాదంబులు నమ్మిన
నాపద లెక్కడివి జనుల కత్యుగ్రమహా
దీపిత దావ జ్వలనము
పైబడ కుండెడివిధంబు భావింప గదే.

అమ్మయ్యో బాబయ్యో (యేడ్చుచుందురు.)

కృ—(ప్రవేశించి) గోపగోపికాజనంబులారా భయపడకుడు. నే నీ దావానలంబు బోగొట్టెద నొక్కసారి యందరు ను గన్నులు మూసికొనుడు.

(అందరు నట్లు చేయుచున్నారు) దావానలము చల్లారును.)

1గో—(చూచి) కిట్టయ్యా మళ్లీ మాయమ్మకడుపులో బుట్టినట్టే ఉంది. నీమాత్రం యొం తుందయ్యా యిట్టే ఆరిపోయింది. యింక రండిరా యింటికి బోదాం.

(అందరు నిష్క్రమింతురు.)

---



# కృష్ణలీల.



## షష్ఠాంకము.

---

రంగము మధురాపురము.

(కంసుడు విచారక్రోధములతో ప్రవేశించును.)

కం—(విచారముతో) అప్పుడు చంపకుండ విడిచిపెట్టినందులకు గదా యీవసుదేవుం డింతపని యొనర్చెను. ఆనారదుం డీసంగతి యంతయు నెరిగింపకయే యున్నచో నాకేమియు తెలియగలదు. అరేమర్మజ్ఞా వసుదేవా యెంతపనిచేసితివి. ఇంటనుండి యింటి వాసములను లెక్కపెట్టితివిగదరా. ఆనారదుండే యడ్డపడక పో యినచో నీపాటికి యమసదనమున జేరి యుందువుగదా. ఛీ పాపీ నిన్నేమిచేసినను పాతకము రానేరదు. ఎవడురా ద్వారము కడ నున్నవాడు.

భటుడు—చిత్తము మహాప్రభూ (యనుచు బ్రవేశించును.)

కం—నీవేగి చాణూరముష్టికులను దోడ్కొనిరమ్ము.

భ—(చిత్తము అనుచు నిష్క్రమించును)

కం—(అట్టహాసముతో లేచి) ఏమీ నారదుడు వచించినవాక్యములు చూ డనారామకృష్ణులే నాతో విరోధమును బ్రకటించుచున్నారట ఏమీ.

శా॥ ఎందుఁ నన్నెదిరించి పోరుటకు దేఁ వేంద్రాదులుం జాలరీ
బృందారణ్యమునందు నిప్పుడు మదాఁ భీరార్భకు లా్రమగో

విందు లార్థిలుచున్న వారట రణో • క్రిన్ గండు నొప్పింతు మం
తుల దర్పంబులు వల్కుచుందురట యీ • చోద్యంబుల్ వింటిరే

(చాణూరముష్టికులు సదర్పముగా ప్రవేశించుచున్నారు.)

చా—దేవా జయ మగుగాక.

ము—మహారాజా మమ్ముల బిలువ నంపినకారణ మేమి.

కం—ప్రియ సేవకులారా చాణూరముష్టికులారా వినుండు బృందావనమున మద్విరోధు లగురామకృష్ణులు పెరుగుచున్నారట వారలనిటకు ధనుర్యాగమునకు రావలసినదిగా బిలిపించెద. అప్పుడు మీప్రతాపములు చూపవలయు.

చా—(చేతులు చరచుచు) మహారాజా మాకు బిండివంటలతో భోజన మొనరించినంతసంతోషము.

ము—మాభుజములతీట గొంచెము తీర్చుకొనుసమయము వచ్చినది.

కం—సేవకులారా!

శా॥ విన్నాణంబుగ బోర నేర్తురు మహా • వీర్యప్రతాపాదిసం
పన్నుల్ మీరలు మేటిమంతనమునన్ • బ్రఖ్యాతులై పెంపుతో
మన్నా రాబలకృష్ణులం బెనకువం • మర్దించి మత్ప్రీతికా
సన్నుల్గాడు పురీజనుల్ పొడగ నో • చాణూర యోముష్టికా॥

చాణూర ఇంతకన్న మాకుగావలసిన దేమి.

ము—మహాప్రభూ నల్లులను నలిపినట్లు నలిపివైచెదము.

చా—ఈబాలురా మాతో మల్లయుద్ధ మొనర్చువారు వారికి కాలమాసన్నమయినది గాబోలు.

ము—ప్రభూ మాకు సెలవు దయచేయుదురా.

కం—జాగ్రత్తగా నుండుడు పొండు.

(చాణూరముష్టికులు బోవుదురు.)

కం—సేవకా.

సే—(ప్రవేశించును.)

కం—

కం॥ పశువిశసనములు సేయుఁడు
పశుపతికిం బ్రియము గాఁగ ♦ భావించి చతు
ర్దశినాడు ధనుర్యాగము
విశదంబుగఁ జేయవలయు ♦ విజ గుణకోటుల్॥

ఈప్రకారము పట్టణమంత చాటు బంపుమని సేవకుల కాజ్ఞాపత్రము
లను బంపుము. మరియు మనయక్రూరు నిటకువేగ్రా
రమ్మని పొమ్ము.
సేవకుడు తమసెలవుప్రకార మొనరింతును [పోవును.]

[అక్రూరుడుప్రవేశించి] రాజా! పిలువ నంపినకారణ మేమి?
కం—(లేచి) అక్రూరునిచేయి బట్టుకొని అక్రూరా నాకును నీకును గల
చిన్ననాటనుండి యున్నమిత్రత్వమునకు ఫలము జూపుకాల
మాసన్నమయినది వినుము.
గీ॥ నాకు వెరచి సురలు * నారాయణుని వేడి
కొనిన నతఁడు వచ్చి * గోపకులము
నందుఁ గృష్ణమూర్తి * యానకదుందుభి
కుదితుఁడయ్యె ననఁగ * నొకటి వింటి॥

గావున

శా॥ అక్రూరత్వముతోడ నీవు మన * నక్రూరనామంబు ని
ర్వక్రత్వంబునఁ జెల్లె మైత్రి సలుపన్ * వచ్చున్నినుం జేరి నీ
వక్రోధుండవు మందలోఁ బలకృ * ష్ణా భీరు లస్మద్వినా
శక్రీడారతులై చరింతు రఁట యా* బం దెచ్చి యొప్పింపుమా॥

ఈయుపకారం బొనరించి ధనుర్యాగ మనుమిషఁ గల్పించి వారల నెట్ల
యిన దోడ్కొనిరమ్ము. ఎట్లయిన వారల జంపవలయు.

అ—ఏయుపాయ మాలోచించితిరి.

కం — అక్రూరా వినుము.

శా॥ కొండ ల్గూలఁగ ద్రొబ్బు కొమ్ములతొదిగ్గోపించి కోరాడుచో
దండిందట్టి నధఃకరించునొక వేదండంబు నాయింట బ్రె
హ్మాండం బైనఁగదల్ప నోపు బలకృష్ణాభీరులం బోరిలో
ఖండింపం దడ లెంతదాని కదియుం గాదేనియక్రూరకా॥

అ—(తనలో) అహా! క్రూర యెంతపన్నుగడలు పన్నుచున్నాడు.

కం—మనవద్ద నున్నచాణూరముష్టికుల నెరుంగుదువుగదా వారలను
జయించువారీజగమున లేరు. వారలప్రతాపంబు నేనెరుంగుదును
ఆమల్లు లిరువురు నారామకృష్ణుల నవలీల నధిసపగలరు. అప్పుడు
మనశత్రుశల్యము నశించును. అనంతరము వసుదేవాదు లందరిని
జంపి సుఖముగా మిత్రులతో రాజ్యపరిపాలన మాచరించుకోన
వచ్చును.

అ—(తనలో) వీనికి మృత్యుకాల మాసన్న మగుటబట్టియే యీబుద్ధు
లుత్పన్నము లగుచున్నవి. కానున్నది కాకమానదు (ప్రకాశ
ముగా) రాజా! అట్లనే తీసికొనివచ్చెదను.

కం — కొంతమనశ్శాంతి యయినది. పోదమురమ్ము.

యిరువురునిష్క్రమింతురు.

రంగము బృందావనసమీపము.

అక్రూరుడు ప్రవేశించును.

అ—(తనలో) ఓకృష్ణా దేవకీనందనా నీదగ్గనాపేక్షచే బయలుదేరి
వచ్చుచుంటిని దురాత్ముం డయినకంసహతకుడు నీయన్నల
నార్వురం జంపి యు నింక మిగిలియుండిరని నారదునివలన విని

మాయిరుపురం జంప నిశ్చయించి మిమ్ముల దీనుకరమ్మని నన్ను బుత్తెంచెనో దేవా, లోకరక్షకా నీమాయాజాలము నెరుంగ నెవ్వరి తరము. (ఆలోచించి) ఇంతగా ప్రయాణమై యేగుచున్న నన్ను జూచి యేమనునోగదా.

మ॥ ఇతఁ డా కంసునిచేతఁ బంపఁబడిన * హింసింప నేతెంచినాఁ
డతిదుష్టుండని చూచునో సకలభూ* తాంతర్బహిర్మధ్యసం
గతుఁ డౌటం దలపోసి నన్ను సుజనుం * గా జూచునో యెట్టియు
న్నతిఁ గావించునో యేక్రియం బలుకునో * నాభాగ్యమెట్లున్నదో.

విరోధివద్దనుండి వచ్చినంతమాత్రమున నన్నేల మన్నింపకుండును. సమస్తమునిజనమానసముల నెరింగినయాతడు నాచిత్త మెరుగకుండునా. భక్తుల రక్షింపకుండునా.

ఉ॥ మాఁపటివేళ నేను జని * మాధవుపాదసమీపమందు దం
డాపతితుండ నైన నతఁ * డాశుగకాలభుజంగవేగసం
తాపితభక్తలోకభయ * దారుణమైనకరాబ్జ మాదల
నోమ్మసి, హాసించి నాకభయము * ల్దయతోడుత నీయకుండునే.

దేవునియందు గల విరోధమున నైన నాకీయుపకారము కంసుడే యొనరించినందులకు సంతోషము.

ఉ॥ సూరులు తొల్లి యేవిభుని * శోభితపాదనఖప్రభావళిన్
జేరి భవాంధకారములఁ * జిక్కక దాటుచు రట్టిదేవునిన్
వైరముతోడ నైనఁ బిలు * వన్నను బంచి శుభంబుఁ జేసె ని
ష్కారణప్రేమతోడ నిదె * కంసుని బోలు సఖుండు గల్గునే.

అదిగో నాకు శుభశకునములు గూడ గల్గుచున్నవి.

మ॥ అలకభ్రాజితమై సుధాంశునిభమై * హాసప్రభోద్దామమై
జలజాక్షుం బయి, కర్ణకుండలవిరా * జద్గండమై యున్నయా

బలజ్ఞాతాఖముఖంబుఁ జూడ గలుగున్ ♦ సత్యంబు ప్రా సౌకు నా
వలది క్కేగుచు నున్న పీవన మృగ ♦ వ్రాతంబు లీతో్రివలః.
(ముందునకు నడచి) యిదిగో బృందావనము శ్రీకృష్ణునిచే త్రొక్క
బడినభూములు గన్నను గొంతపుణ్యము గలుగును.
ఉ॥ ఎన్నఁడు నైన యోగివిభు ♦ లెవ్వనిపాదపరాగ మెంతయున్
గన్నులఁ గాన రట్టిహరిఁ ♦ గౌఁగిట జేర్చుచుఁ జెట్టఁబట్టుచుఁ
దన్నుచు గ్రుద్దుచు న్నగుచు ♦ దద్దయు పైఁబడి కూడియాడుచున్
మన్నన సేయువల్లవకు ♦ మారుల భాగ్యము లింత యొప్పునే.
(ముందునకు నడచి) అదిగో ఆదెసనుండి రామకృష్ణులే గాబోలు నిటే
వచ్చుచున్నారు. అదిగో నీలమేఘశరీరము. అల్లదిగో హస్తమున
వేణుదండము. ధన్యుడను ధన్యుడను.
ఉ॥ ఎట్టితపంబు సేయఁబడె ♦ నెట్టిచరిత్రము లబ్ధ మయ్యె నో
యెట్టిధనంబు లర్థులకు ♦ నీఁబడె నో తొలిబామునందు నా
యట్టివివేకహీనునకు ♦ నాదిమునీంద్రులు యోగదృష్టులన్
బట్టఁగలేనియీశ్వరుని ♦ బ్రహ్మనుతుః హరిఁ జూడ గల్గెడిః.
(రామ కృష్ణులు ప్రవేశించుదురు.
రా—ఈత డెవ్వరో గదా.
కృ—పట్టణ వాసివలె నున్నాడు.
అ—కృష్ణా ఆపద్బాంధవా లోకరక్షకా భవద్దర్శనంబున ధన్యుండనయి
తిని. నీమహిమల నెరుంగ నెవ్వరితరము. మొన్న నారదుండు
చెప్పగావింటి.
సీ॥ జగతీశ యోగీశ ♦ సర్వభూతాధార
సకలసంపూర్ణయీ ♦ శ్వర మహాత్మ
కాష్ఠగతజ్యోతి ♦ కైవడి నిఖిలభూ
తలమందు నొకఁడవై ♦ తనరినీవు

సద్గుణాఢ్యుఁడవు సుఖా ♦ శయుఁడవు సాక్షివి
నీయంతవాఁడవై ♦ నీవు మాయఁ
గూడి కల్పింతువు ♦ గుణముల వానిచేఁ
బుట్టించి రక్షించి ♦ పొలియఁజేయు

గీ॥ దీప్రపంచ మెల్ల ♦ నిట్టి నీ విప్పుడు
రాజమూర్తులైన ♦ రాక్షసులను
సంహరించి భూమి ♦ చక్రంబు రక్షింప
నవతరించినాఁడ ♦ వయ్య కృష్ణ.

ఓ రామకృష్ణులారా నే నక్రూరనామధేయుఁడ. నాది మధురాపురము. కంసునిపంపున ధనుర్యాగము చూచుటకు తీసికొని పోవవచ్చితిని. ఆ క్రూరరాక్షసుఁడు మిమ్ము నెట్లయిన వధింపవలయునని యాలోచించుచున్నాడు. ఎట్లయిన నేమి. ఆదివిరాట్స్వరూపులరైనమిమ్ముగని ధన్యతముఁడనైతిని.

బ—అక్రూరా నీవు మాబంధుసంతతిలోనివాఁడ వగుటచే మావారింగాంచినట్లే సంతోషముగానున్నది.

మ॥ శుభమే నీకు ప్రమోదమే సఖులకున్ ♦ జుట్టాలకు న్క్షేమమే
యభయంబే ప్రజకెల్ల గోత్రములు ని ♦ త్యానందమే మామము
క్తభయుండే వసుదేవదేవకులు ద ♦ త్కారాగృహంబందు మ
త్ప్రభవవ్యాజనిబద్ధులై బ్రతికిరే ♦ ప్రాణానిలోపేతులై.

అ—దేవా అందరును గుశలులై యున్నారు. దేవకీవసుదేవులను మరల కారాగారమున నుంపించినాడు. వారిరువురి ట్లున్నంత కాలము కంసుఁడు ముక్తభయుఁడై యుండుట యెట్లు అందులకే గదా మిమ్ముల దోడ్కొని రమ్మని మమ్ము పంపినాడు.

శ్రీ—అక్రూరా మమ్ములను జంపుటకా మామయందు స్నేహము నెరపుచున్నాడు. ఎంతయాలోచ నాలోచించినాడు. వేడుక బోయిన

తీగ పదములకే దగిలినట్లు మేమును మాతాపితృ దర్శనమునకు వేగిరపడుచు నగరప్రవేశము నాలోచించుచునే యున్నాము. అందుచే మామామ మేలు చేసినవాడే యగును.

మరియు నింకొకటి యడుగ మరచితిని.

మ॥ నెరి నే డిక్కడ నీవు రాగ పగతో నీకోడ నేమైన నా
కెరుగం జెప్పు మటంచు జెప్పరు గదా యేమంద్రు నావార్త లే
తెరగుస్ లేవని డస్సిరో వగచిరో దీనత్వముం జెందిరో
వెరతో నాతలిదండ్రు లెట్లు బడిరో విన్పింపు మక్రూరకా.

అ—శ్రీకృష్ణా మీతలిదండ్రులు కారాగారబద్ధులై ఏమని చెప్పగలుగుదురు కారాగార మోక్షణము మాత్ర మాశించి యున్నారు.

బ—అక్రూరా కుమారులు గలిగి యుండి యు వారిట్లు బాధ లనుభవించుచున్నారు మే ముండి యు నేమి యు చేయజాలనివార మయితిమి.

కృ—(కోపముతో) ఏమీ మాతలిదండ్రులను బాధించుచున్నాడా కంసుండు ఆదురాత్మునికి కాలమాసన్న మగుటబట్టి కాబోలు యిట్టి దుర్మార్గమున కొడిగట్టుచున్నాడు కానిమ్ము.

బ—అక్రూరా మల్లరంగోత్సవ మెప్పుడు జరుగును.

అ—రామకృష్ణులారా రేపు చతుర్దశినాడు ధనుర్యాగము చేయుటకును మల్లరంగోత్సవమునకును నిర్ణయింపబడినది.

కృ—అట్లయిన రేపే ప్రయాణమా సంతోషము.

అ—దేవా శ్రీకృష్ణా నీనిజరూప మొక్కసారి చూపి ధన్యుం జేయుము.

కృ—అక్రూరా అటు చూడుము (తెరపై ఆదిమూర్తి గనుపడును.)

అ—(చూచి కన్నులు మూసికొని) తెరచి దేవా భక్తచింతామణీ సచ్చిదానందమూర్తీ ధన్యుడను నాజన్మ పావన మయినది యింక నాకేకోరికయు లేదు కృష్ణా.

నీవు యశోదబిడ్డడవె నీరజనేత్ర శ్రీవసుస్తవంబుచే
నా విదితాత్మ నీవుడవు తొల్లి వరించి దలంచి లోకర
క్షావిధ మాచరింపు మని సన్నుతి సేయగ సత్కులంబునన్
భూపాలయంబు గావ నిటు పుట్టితి గాదె మహోహరాకృతిన్.

కృ—అక్రూరా సాయంకాల మగుచున్నది గృహంబునకు పోవుదము రమ్ము.

అందరు పోవుదురు.

తెరపడును.

రంగము మధురానగరములోనివీధి.

గోపాలుడు, రజకుడు ప్రవేశము.

గో—ఒరే చాకలీ మారామకృష్ణయ్యలు మీరాజుగారిని సూడ మోతున్నారు కనుక నీమూటలో మంచిబట్ట లారికి య్యాల తే

ర—ఓరి యెవడవురా నువ్వు ఒళ్లెరక్కుండా పేలుతుండావు

గో—యేంటీ నేనాకిట్టయ్యతో తిరిగే గొల్లాయన్ని తెలిసిందా.

ర—ఓరి వెట్టిగొల్లోడా సాలు సాలు నీవడివిలో ఉండవలసినోడవే రాజబట్టు లొచ్చారంటే యేసుకుంటారు పో.

గో—ఏం జేస్తా రేంటి.

ర—పానాలు దీసేత్తారు.

గో—నేనేం తప్పుమాట లన్నానని పానాలు దీత్తారు బట్టలు మనుస్సులు కట్టుకోక మోతే మాళ్లు గట్టుకుంటాయా యేంటి.

ర—ఏంటీ యీబట్ట లెవరివను యెరుగుదువా మారాజులోరివి అడివిలో ఆళ్ళు కట్టుకునేవి గావు.

గో—నాకక్కర్లేదు లే మారామకిట్టయ్యలు గట్టుకోగూడదా.

ర—అలాంటిఅడివిమనుసులకా యీబట్టలు ఆళ్ళని రమ్మను సెప్తాను.

గో—ఆయ నొచ్చాడంటే నీపని తీర్చేస్తాడు లే.



ర—ఏంటీ పొగరొక్కన్నారు అటే చూద్దాం రమ్మను.

రామకృష్ణులు ప్రవేశించుచున్నారు.

రా—కృష్ణా అదిగో మనగోపాలు డీచాకలితో దెబ్బలాడు చున్నాడు చూడు.

కృ—గోపాలా యేమి టది.

గో—కిట్టయ్యా నమయాని కొచ్చావు యీ సాకలోడు నీకు బట్ట లియ్య మంటే యిమాటంలేదు సూడు.

కృ—ఓరీ చాకలి

ఉ॥ వెందులమై నరేశ్వరుని * వీటికి వచ్చితి మేము మాకు మా
మందలలోనఁ గట్టికొన * మంచిపటాంబులు లేవు నీముడిక్
సుందరధౌత చేలములు * శోభిలుచున్నవి తెమ్ము నిమ్ము మే
లందెడి నిమ్ము రాజు దెస * నల్లుర మోరజకాన్వయాగ్రణీ.

ర—ఏం టేటీ రాజుగారిబట్టలు మీకియ్యాలా మీారు గట్టుకుంటారా. ఏంటీ యింత సాలునాలూరుకో నచ్చిపోగలవు ఏనాడైనా గట్టేవా.

రా—తమ్ముఁడా ఊరకుండుటేల?

కృ—ఒక్క చరుపుచరచి నేలబడవైచి యీాశ్చీ నీబాబు యెవడొస్తాడు రా అన్నా మంచిపటంబులధరింపుము (మూటలోనుండి తీసికొని ధరింతురు).

గో—నేలివి తీసుకుంటా (ధరించును.)

రా—తమ్ముఁడా యీాబట్టలకు దగినట్లు సుగంధద్రవ్యము లుండవలదా.

కృ—అన్నా మనము బయలుదేరినవేళనుబట్టియే అన్నియును సమకూడును.

[అంతట నొకమాలాకారుడు చనుదెంచి] మహాభాగులారా సేవకుడు నమస్కరించుచున్నాడు.

రా—లెమ్ము నీవు రాజుగారి సేవకుడవయ్యు మమ్ముల నారాధించితివి సంతోషము.

కృ - సుదామా నీకోరిక యేమి?

సు—మీదర్శనభాగ్యము గలిగినది. వేరుకోరిక యేమిగలదు. మహాభాగులారా నాయుడతభక్తి నంగీకరింపుడు. [చెరియొకహారము ను మెడయందుంచి యిరువురకు గంధ మలంకరించును.]

కృ—రాజుగారిని చూచుటకు మేమీవేషములతో బోవుటయేమంచిది.

తెరలోకలకలము.

సు—(భయముతో) అయ్యాలారా! ఇంకెట్లు బ్రతుకగలము. అదుగో కువలయాపీడమును మనవంకకే దోలుచున్నాడు. దానియెదుర నిలుచుటకైన శక్యమగునా.

కృ—(చూచి)

శా॥ ఓరీకుంజరపాల మాదెసకు నీ * యుద్యన్మదే భేంద్రముం
బ్రేరేపం బని లేదు ద్రిప్ప మదిలో * బ్రేరేపిన న్నిన్ను గం
భీరోగ్రాశనితుల్యముష్టి హతులన్ * భేదించి నేడింతకుం
జేరం బుత్తు మహత్తర ద్విపముతో * సిద్ధంబు యుద్ధంబునన్॥

రా—ఏమియు వినుపించుకొనకుండ నీవంకకే దోలుచున్నాడు.

కృ—(నడుముబిగించి) అన్నా మీరిట నుండుడు దానిమదమణగించి వచ్చెద [పోవును]

రా—గోపాలా! చూచితివా మనకృష్ణుడాయేనుగు నొక్కదెబ్బతో చంపివచ్చుచున్నాడు.

గో—కిట్టయ్యా మంచిపని జేసేవు.

(కృష్ణుడు ప్రవేశింప గా రాముడు కౌగలించుకొని) తమ్ముడా మదద్విపేంద్ర మింతసులభము గా జచ్చు నని తలంప లేదు.

కృ—అన్నా దానికేమి గాని మన మింక మల్లరంగమునకు బోదము.

రా—స్వారీ సహప్రున్ను ఇంటిక ముందునకు నడతురు.

తెర యెత్తగా మల్లరంగము గనుపడును సభ్యులు కూర్చుండి యుండ
గా చాణూరముష్టికులు ప్రవేశింతురు.

చా—ఓహో కృష్ణా వచ్చితివా.

సు॥ వనమార్గంబున గోపబాలకులతో * వత్సంబులన్ మేపుచున్.
బెనగన్ మిక్కిలి నేర్చినారనుచు నీ * పృథ్వీజను లెప్ప మా
మనుజేంద్రుం డిట మిమ్ము జూడ బనిచె * న్మల్లాహవక్రీడలన్
జనదే కొంత పరాక్రమింప మనకున్ * సభ్యుల్విలోకింపగన్.

కృ—ఆహా అందుకు సందియము మేము అట్లే వినోదింప వచ్చినను గాని

ఉ॥ సాములు లేవు పిన్నలము * సత్వము గల్గదు రాము మల్లసం
గ్రామవిశారదుల్ కులిశ * కర్కశ దేహులు మీరు మీకడన్
ఏము చరించు టెట్లు ధర * నీశుని వేడ్కలు సేయువారముం
గాము వినోదముల్ సలుప * గాద వచ్చునె యొక్కమాటికిన్.

చా—అయినచో మా యిరువురితో మీ యిరువురును బోరగరాదా?

రా—పోరుటయే మీ యొద్ద నుండుచుక మల్లయుద్ధ మభ్యసించెదము.

చా—అయినచో నెవ రెవరిని గూడి పోరుదురో దెలుపుడు.

కృ—ముష్టికునితో మా రాముండు బెనగును నీతో నేను బెనగి మల్ల
యుద్ధనైపుణ్య మెఱింగెద గాక.

చా—ఆలస్యమేల ముష్టికా రమ్ము నడుము బిగించుము.

ము—(కోపముతో)

శా॥ నాతోఁ బోరఁగ నెంతవాఁడ వసిరో * నావంటి యే నీవు వి
ఖ్యాతుండం గులజుండ సద్గుణుఁడ స * త్కార్యస్వభావుండ నీ
కేతాదృగ్విభవంబు లెల్ల గలనే * యీపీఁచు బోరాటల
న్ప్రేతల్ సూడఁగ గుప్పిగంతు లిడుటే * వీక్షించు గోపార్భకా.

రా.— అప్పుడే యీగర్వోక్తు లేల యిల్లలికినంత నే పండుగ గాదు
సభలో నున్న కంసుడు తనమనంబున

శా॥ ప్రాణుల్ మెచ్చఁడు బ్రహ్మఁ గైకొనఁడు విష్వక్సేను నవ్వున్ జగ
త్త్రాణున్ రమ్మన వెడితు గాదని మహాబాహాబలప్రౌఢి న
క్షీణుం డాజికి నెల్లి నేడనక నై జిత్రి స్వినోదించు నా
చాణూరుం డొకగోపబాలకునికే శక్తుండు గా కుండునే॥

నాకోరిక తప్పక దీరగలము.

చా— కృష్ణా ఆలస్యమేల రమ్ము.

కృ— సిద్ధము. అదిగో అన్న ముష్టికునితో తలపడబోవుచున్నాడు.

చా— కృష్ణా ఇంచుక యాలోచించుకొనుము

సీ॥ మహిమతో నుండఁగ * మధురాపురము గాని
పోలువారి వైకుంఠపురము * గాదు
గర్వంబుతో నుండ * కంసునిసభ గాని
సనకాదిమౌనుల * సభయుగాదు
ప్రకటించి విఱుగ నా * గోపాలునాకము గాని
నాంసుపీ శాస్త్ర * సంబు గాదు
చదురులాడఁగ మల్ల * జనవిగ్రహము గాని
రమతోడ్రెయైన * గ్రహము గాదు

గీ॥ వెలసి తిరుగంగ వేదాంత * వీధి గాదు
మొరగి పో మునిమనముల * మూల గాదు
సాగి నడువంగ భక్తుల * జాడ గాదు
శౌరి నా ప్రోల సేవెందు * జనియె దింక॥

కృ— చాణూరా బీరములాడ నేల రమ్ము.

చా— (తనలో) మా కంసునిబుణ మింతకాలమునకు తీరుకాల మాసన్నమయినది (ప్రకాశముగా) రమ్ము.

(కృష్ణచాణూరులును రామముష్టికులును అనేకవిధములుగా మల్లయుద్ధ మొనరింతురు.)

చా—(తనలో) అన్నయ్యా వీనిది వజ్రశరీరము గాని మానుషదేహ ము గాదు. వీనిముష్టిఘాతములు నాకేబాధ గలిగించుచున్నవి.

ము—ఈబాలుడు దైవముగాని మానుషమాత్రుడు గాడు. కొంతయు ద్ధమునలిపి రామకృష్ణులు ముష్టికచాణూరులను సంహరింతురు.

కృ—(రాముని కౌగలించుకొని) అన్నా యిక్కడికి వీరలపని సైనది.

కం—[సభామధ్యమునుండి లేచును.]

సభ్యులు—విజయులగు మిమ్ముల నభినందించుచున్నాము.

కం—(కోపముతో) సేనానాయకులారా! యేమి యీయల్లరి. వీరలను జూడగా నల్లరి కే తెంచినట్లున్నది. గావున నీ

ఉ॥ వల్లవబాలురి న్నగరి ♦ వాకిటికి న్వెడలంగ ద్రొబ్బుడీ
గొల్లల ముట్టికో ల్లొ నందు ♦ క్రూరుని నందుని గట్టుడుర్వికిఁ
దెల్లముగాగ నేడువసు ♦ దేవుని జంపుడు తండ్రిగాడు వీఁ
డెల్లవిధంబుల న్బరుల కిష్టుడు ♦ గావకుడుగ్రసేనునిన్॥

(చిందులుద్రొక్కును)

కృ—ఏమీ విజయులగు మమ్మభినందించుటకు మారిట్లు పలుకుచుంటి వాసీనాలుక చీలికలుచేసినను పాపములేదు.

కం—ఏమీ గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించుచున్నది. చూచుచు టిరేమి గెంటుడు.

రా—తమ్ముడా! యెంతసేపువీనితో సరసము. వీని కించుకబుద్ధి చె ప్పుదునా

కృ—వలదు నేనేచెప్పెదను. (సభామధ్యమున కరిగి) కంసుని జుట్టుబట్టు కొని క్రిందికీడ్చి ఏమీ ప్రేలుచుంటివి. మమ్ములను ధనుర్యాగ మునకు బిలచి గెంటుమనుచుంటివా యీపాటికి నోరుమూయుము

కం—(కోపముతో లేచి కత్తి ఝళిపించుచు) ఇదిగో చూడుము నీమస్తకము భూమింపబడుచున్నది. ప్రాణముల కాసించితివేని పారిపొమ్ము

కృ—ఇకని న్నుపేక్షించుట తగదు. (జుట్టుబట్టుకొని క్రిందబడద్రొన్ని కంఠమునరికి చంపును.

తెరలో

ఎవడురా మాయన్నను వధించినవాఁడు.

కృ—అదిగో కంససోదరులు క్రోధముతో వచ్చుచున్నారు. వారలకు గూడ కాలమాసన్న మయినదిగాబోలు.

రా—తమ్ముఁడా! నీవు శ్రమపడవలదు. వారలను నేను చక్కఁబెట్టివచ్చెదను.

(లోనికి బోవును.)

ఒకసభ్యుడు—సభ్యులారా! చూడుడు అదిగో రాముడందరను వధించి రక్తాభిషిక్తుఁడై వచ్చుచున్నాడు.

కృ—(రాముని కౌఁగలించుకొని) అన్నా యింక నాలస్యమెందులకు మాతాపితృసందర్శనము చేసి రాజ్యము రాజకము గాకుండ మాతామహునుగ్రసేనుని పట్టాభిషిక్తుం జేయుదము.

రా—ఆలాగే చేయుదము నడువుము.

సభ్యులు—సభ్యులారా! మనముగూడ నాయుత్సవమును గాంచి సంతోషించుదము రండు.

(అందరు నిష్క్రమింతురు.)

గీ॥ భాగవతులాన్వయాబ్ధికు ♦ భ్రాంశుమూర్తు
లైనవేంకటరత్నశే ♦ షాంబలకును
నల్లుఁడైనజగన్నాథు ♦ డల్లెనిద్ది
దనరు గావుత నాచంద్ర ♦ తారకము.గ॥

కృష్ణలీల సమాప్తము.

---

# సాంగ్స్.

## దేవకీ కీర్తన

చంప బోకుమా । అన్న । అన్నయ్యా అన్న ॥చ॥

1 చిన్ననాటి నుండినీవు । మన్నన । చేయుచునిపుడు
తెన్నునకాపాడుము । అన్నాయెత్తినా వేనీకు ॥చం॥

2 నిన్నగాక మొన్నపెండ్లి । యెన్నగ నతివైభవమున
క్రొన్నన జేసితివిగాదే । మన్నించుట తగదేనక ॥చం॥

3 నీవే తల్లిదండ్రియనుచు । నెమ్మదినమ్మినన నన్నిడు
గావకున్న లోకులు ని । న్దని నగరే యిదితగునా ॥చం॥

4 చక్రవర్తివైననిన్ను । చంపుననుచు వచియించిన
నాక్రమ మెరుగవలదే । యెవ్వరైన నమ్ముదురే ॥చం॥

[2. వాసుదేవుడు కీర్తన]

1 భావనా । మాట । వినుమా
యిదిఘనమా । యికజనుమా ॥భా॥

2 యెవ్వరో వచియించితిరని । దవ్వగ నాలోచింపక
జవ్వనినిటు క్రూరాసిని । జంపదలప న్యాయమానే ॥భా॥

3 అష్టమగర్భమట । కష్టములను గూర్పునంట
సష్టజాతకంబుగాదే । నమ్మకెట్లు యీమాటల్ను ॥భావనా॥

(3. కంసుడు కీర్తన)

చాల్చాలూ దూరముంచుమా । నీసదోడ్బదలనిక గట్టిపెట్టుమా ॥
చాల్చాలూదూరముంచుమా॥
ఆకసమున వశరీరవాణి । మీయష్టమగర్భమునక జంపునన్ । దా

కొవేయ। దీని క్రోధముల నే పాపులయుగా [illegible] [illegible]
నైతురా ॥చాల్చా॥

(4. దేవకి కీర్తన)

అన్నన్నా దయన్ జూతుమా । నీకన్న దిక్కెవ్వరీ భువిని ॥అన్న॥
యింతకాలము వేంచినీవే । యింతకఠిన మూనియుండుట తగునే ।
చెంతాజేరుదాన నెవ్వరి । నింత వేడుకొందు నకటా ॥అన్న॥

(5. వాసుదేవుడు కీర్తన)

శాంతినొందుమా బావా శాంతినొందుమా॥
వింతగా నశరీరవాణి । వెనుకజెప్పినదిగావున
సంతమూన నెల । నాదుప్రార్థనంచు విని తదుపరి ॥శా॥

(6. కంసుడు కీర్తన)

చాల్ చాల్ పో నీ సామవాక్యముల్
ఏలనాదుప్రాణములకు । కాలసర్పమైననీని । లీలగావధయింపగానే ।
బేల నేవిడువనోరా ॥చాల్॥

(7. వాసుదేవుడు కీర్తన)

కాదు కాదు బావా నీవుకరుణజూడుమయ్యా ॥
అతివనుజంపగనేలా । అష్టమగర్భమునిత్తుగా
కుతుకములుతో నిన్నుగోరు । కొనుచుంటిని నన్నుగ[illegible]॥
పడతిజంపనేలా । యీ పాపమందనేలా
బుడతలనీకిచ్చినచో । యిడుములు నీకుండవుగదా ॥కాదు॥

(8. బ్రహ్మ శంకరుడు యింద్రుడు కలసి పాడెడు కీర్తన)

శ్రీత్రిలోకా నాధా వందనం । త్రిలోక[illegible]
చరిత వందనం॥

నీ—నా—ధా—రా
మారజనక—కృపావిజితా—మంజుభాషణా
దేవా—బ్రోవా—రావా—వేగన్ ॥శ్రీ॥
దుష్టులెల్ల సాధుజనుల । కష్టపెట్టుచుండిరిగా
నిష్టలెల్లమంటగలిసె । నీవుదయించవేలా
జాలా—మేలా—చాలూ—చాలూ ॥శ్రీ॥

(9. గోపికాస్త్రీలు కీర్తన)

ఏమనిజెప్పుదుమమ్మ । మేమెట్టుల సైతుమమ్మా
నీకుమారుడు జేసెటి । కొంటెపనులనెల్ల ॥నే॥
యింటిలోననుండి । వంట జేసుకొనుచుండ
జూసివెన్నదింటు । పారిపోయె ॥నే॥
మాపిల్లస్నానమాడుచుండ । దొడ్డికడి కెగి కోకకటుకోమనిచ్చె ॥నే॥

(10. గోపాలురు కీర్తన)

కిట్టయ్యా—ఆడుకొందుమా—కిట్టయ్యా
ఉట్టిలోచుట్టాలుబెట్టి । నట్టయడవికెగిమనము
గుట్టా లెక్క పుట్టా లెక్క । చెట్టుల కొతికొమ్మచ్చి
ఆవులను మేతకంపి । అందముగూడిమనము
సావకాశముగాను । మనముచల్దికూళ్లుదిన్ని ॥కిట్ట॥

(11. బ్రహ్మ కీర్తన)

శ్రీధరా శుభకరా । శ్రితజనమందారా
శ్రీకరా శ్రితధర సేవకుడగానా
నీవూ—వినా—నాకు—గానా
నీమహిమలు నెరగకనే । నిటుశేసితి దేవా
బ్రోవా—రావా—దేవా—గావా ॥శ్రీధరా॥

(12. గంధర్వుల కీర్తన)

నిన్ను నెన్నమా తరమా । నీరజాతదళలోచనా
యెన్నగా నీమహిమావళి । నరగతరమె యెవ్వరికైనా ।
సన్నుతి జేయగా నీభువిని । అన్నా క్రిష్ణ నన్ను కావగ ॥ని॥
శాపవిధము చేతనిట్లు । భూపతీతుల మైతిమిగ
పాపుగోరయుంటిమి । మముగాపాడగా నీవు కావె ॥ని॥
రాక్షసాళిదునిమి ॥ గోరక్షణంబు సేయుగాను
నాక్షద్విష్ణుడవీవె । జగముంచితిరయ్యయిట్లు ॥ని॥

(13. రాధ క్రిష్ణుడు డైలాగ్)

రాధ—గోపాలా బాలక్రిష్ణ నాపాలిదైవమా
కోపమదేలా నాపై । కోరికదీర్పుమా
గనుగొనుమా—క్రృపగనుమా—మనవినుమా—
పాపముసుమ్మా ॥గో॥

క్రిష్ణ—యింతి యోకుల కాంత । యిదనీకు తగునటె
కాంతుడు వినననెమో । కాంతా కోపోపామ్మ
యిదిగనుమా—సుడివినుమా—యికజనుమా—దయ
గనుమా ॥ఇం॥

రాధ—నిన్ను నామదిం । నమ్మియున్న దాననుగా
నన్నాకరుణాజూడకున్న । నిన్నువిడువజాల
చలమేలా—గోపబాలా—తాళజాల—క్రీలోల

క్రిష్ణ—చాలుచాలుగోపకాంత । సరసంబులాడకే
యాలీలను నెవ్వరు యున్న । యేమంటుదలతురో
యిదితగునా—నీకగునా—మాటవినవా—నుగ

(15. శ్రీకృష్ణరాములు కీర్తన)

గోపాలబాలకా । నీపరాక్రమంబెటిదో కంసున్

యిదిగో । యీమల్లసభయందున ॥గో॥

కృష్ణుడు—మల్లురంగమన్న । యుల్ల మొప్పంగెదురవలె జూతురమ్మ ।

ముష్టికుడు బలరామునితో ॥గో॥

ముష్టికుండునా । ముష్టిజూడుమిది । సృష్టను జూపునుమా

గాప్రై నిష్ఠగ మెంచకుమా ॥ము॥

రాముడు—భీరము లెలా—సూక్ష్మమునదో—స్వారంబు

లు ముపుచాలా—యిగురురులాడక నేలా ॥భీ॥

(16. కంసుడు కృష్ణుని పైలాగ్)

కం—పట్టుడి కట్టుడి కొట్టుడి నెట్టుడీ

కృరాత్ములు—భీరంబుల—తోరంబుగా బలకన్

ఘోరాసిని—పీరితలలు – దూరంబుగావడద్రుంతున్

కృ—క్రూరులుమా—దూరులుమా—భీరులుమా చీచీ

మారుడకు – నోరెత్తకు దూరముగా పోపో

యికసాగవు—తెగసాగక—మగతనము వీడిపోపోఛా

